# ఆంధ్రగ్రంథాలయం

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షమున వెలువడు

సచిత్ర త్రైమాసికపత్రిక

# విషయసూచిక (Contents)



---

# ఆంధ్ర గ్రంథాలయం

సంపుటము ౧ | డిసెంబరు 1939 | సంచిక ౨


## సంపాదకీయం

*'Instead of noble men, let us have noble villages of men. If it is necessary, omit one bridge over the river, go round a little there and throw one arch at least over the darker gulf of ignorance which surrounds us'—*

HENRY DAVID THOREAU

### డెన్మార్కు సందేశం

అప్రతిమానప్రతిభతో ఫలప్రదాయకమగుచున్న విజ్ఞానసంస్థల కాలవాలమైన డెన్మార్కు-దేశ సందేశము నందజేయుట కెంతయు సంతసమగుచున్నది. జర్మనీకుత్తర సరిహద్దుననున్న యీ డెన్మార్కు-దేశ మించుమించు మైసూరురాజ్యమందు సగముండు నేమొ. ముప్పదిలక్షలకు పైగా జనాభా కలిగిన యీ చిన్నదేశమున జలోద్భవశక్తి గాని, ఖనిజసంపదగాని, బొగ్గుగనులుగాని లేవు; భూసారమొసగు ఫలమే సకల సంపదలకు ఆధారము కావలసియున్నది. కాని నేల సారవంతమైనది కాదు—ఇసుక పఱ్ఱలు, బీడుభూములు, తేమనేలలూను. అయినను అచ్చట అనేక లక్షల గోవులు, పందులు, కోళ్లు, పలురకాల పంటలు, ఎన్నో పరపతిసంఘాలు, కర్మాగారాలూను! వాణిజ్యప్రపంచంలో డెన్మార్కున కమితమైన ప్రఖ్యాతి—ఇంగ్లాండుతోను, ఇతర దేశాలతోను కోట్లకొలది విలువగల వెన్నవర్తకం, జున్నువర్తకం!! గోసంరక్షణలో గొప్ప పేరుపొందిన భారతమాతబిడ్డలకు డెన్మార్కు పాలూ, వెన్నా సప్లయి!!! ఇన్నెందుకు—స్వాభావిక సంపదలు లేకపోయినా, సారవంతమైన భూమి కాకపోయినా, డెన్మార్కు సకలసంపదలతోను తులతూగుతోంది!

కారణం?

అచ్చటి విద్యావిధానం—తద్భవంబగు బుద్ధిసంపద

డెన్మార్కులో ప్రాథమికవిద్య ప్రజలందరకు అందుబాటులోనుండి. వయసుసంను నిరక్షరాస్యతలోనికి మరలకుండుటకును, స్వయంకృషిచే విద్యాలబ్ధులగుటకును

సమాహితమై యొప్పుచున్న గ్రంథాలయములు—రాజధానియైన కోపెన్హాగనులో 2 పెద్ద గ్రంథసంచితస్థానాలు, 80 పట్టణ గ్రంథాలయములు, 800 గ్రామ గ్రంథాలయములు— అద్భుతమైన సేవచేస్తున్నాయి. యువకులు వారివారి అభిరుచులంపు జ్ఞానము నుపార్జించుకొనుటకు ఎన్నో వయోజన విద్యాలయాలు (వీటినే ఫోక్ స్కూల్సు అంటారు) పనిచేస్తున్నాయి. గ్రామీయులలో ఇంచుమించు మూడవవంతు స్వాభిమానంతో, స్వాభిలాషతో, స్వంతఖర్చులమీద, డిగ్రీలకొఱకు ఆర్థికలాభం కొఱకుకాక, విద్యయే ప్రధానంగా ఎంచి వయోజన విద్యాలయాలకు వెడతారు. స్త్రీలు, పురుషులుగూడ ఈ విద్యాలయాలలో చలికాలమైదు నెలలు, ఎండకాలం మూడు నెలలు గడుపుతారు. ప్రస్తుతం అటువంటివి అరువది విద్యాలయాలున్నాయి. వాటిలో 6,000 మంది విద్యార్థులున్నారు. ఈ మధ్య క్రొత్తగా ఎల్సినోరులో 'అంతర్జాతీయ ప్రజాకళాశాల' (The International Peoples' college) అని ఒకటి వెలిసింది. ఇప్పు డీకళాశాలలో వందకు పైగా విద్యార్థులున్నారు. చలికాలంలోను, ఎండకాలంలోను, శెలవులలోను ఏర్పాటుచేయబడే విద్యావ్యవధానములకు వేలకొలది యువకులు వెడతారట. అంతర్జాతీయ సఖ్యతను పెంపొందించుటే ఈకళాశాలయొక్క ప్రధానాశయం; మానసిక, రాజకీయ, ఆర్థిక నిత్యజీవిక సమస్యల నవగాహనచేసికొనడంలో శిక్షణ నొసగి అంతర్జాతీయ సఖ్యత నభివృద్ధిచేయుటకుగాను వివిధ దృక్పథములనుండి చర్చించునట్లు ప్రోత్సాహపరుస్తారు.

ఈ విద్యావిధాన ఫలితంగా సాంఘికంగాను, ఆర్థికంగాను, ఆధ్యాత్మికంగాను కూడ డెన్మార్కు ప్రజలు అద్భుతమైన అభివృద్ధిని పొందుచున్నారు. ఒకప్పుడోడ దొంగలని పేరుబడ్డ డేనులిప్పుడు శాంతిప్రియులయారు. గ్రంథసహాయమున, వయోజన విద్యాలయముల మూలమున అభివృద్ధికరములగు ఆధునిక పద్ధతుల తెలిసికొని, వ్యవసాయ విధానమం దమలుజరిపి పలువిధములగు మేలురకపు పంటలను పండించుచున్నారు. పశువులను పెంచుటయందుకూడ తమ విజ్ఞానమును ఉపయోగించుచున్నారు; చీనా జపాను దేశములనుండి సోయా చిక్కుడుగింజలను తెప్పించి పశుభోజ్యమగు పిండిరొట్టెలను తయారు చేస్తున్నారు; మీగడదీసిన పాలనుపోసి పందులను పెంచుచున్నారు. మత్స్యములను వృద్ధిచేయుటలోను, పట్టుటలోను, కోళ్లను పెంచుటలోను, వాటిగ్రుడ్ల నెగుమతి చేయడంలోను—ఇదీ అదీ అనిలేదు—ప్రతివిషయంలోను విజ్ఞానజనితమగు ప్రజ్ఞావిశేషమును చూపుచున్నారు. విద్యావిధానఫలితముగ డేనుల సంఘజీవనంలో ఉద్భవమైన మరొక అద్భుతశక్తి—వారి యసాధారణ సహకారశక్తి—ఆధునికప్రపంచాని కంతకీకూడ గుణపాఠంబోధిస్తోంది. వ్యక్తిగతంగా కృషిఫలితాన్ని సెల్లవుచేసికొనుట కష్టంగదా! మధ్యవర్తులుచేసే మోసం

తినేలాభం వ్యవసాయదారుల నెంత నాశనం చేస్తున్నారో మన మెరిగినదే! ఈ కష్టాన్నుండి గట్టెక్కేటందుకే దేశమం దెల్లెడల సహకార సంఘాలను స్థాపించు కొన్నారు—డేనులు. వాటి నిర్మాణం, ఉపయోగం విద్యాబుద్ధులైన డేనులకు తెలుసుగాని, పారతంత్ర్యమువలన అనండి మరొకదానివలన అనండి 100కి 90 మంది నిరక్షరాస్యులై, మిగిలిన 10మందిలోను 9మంది పొట్టకూటికై హీనవృత్తుల నవలంబించుచున్న మనదేశంలో ఎలా తెలుస్తుంది. ఉన్నకొలది సంఘాలను దుర్వినియోగం చేయడం మనకు బాగా తెలియునేమో! డెన్మార్కులోని వ్యవసాయదారులు సమష్టిగా సహకారసంఘముల ద్వారా తమకు కావలసిన ప్రశస్తములైన యంత్రములను, ఎరువులను, పశువులను తెప్పించుకొంటారు. తమ కృషిఫలితములగు పాడి, పంట, మాంసము, గ్రుడ్లు సహకారసంఘముల యాజమాన్యముక్రింద నున్న కర్మాగారములకు పంపుకొంటారు. డెన్మార్కులో నిప్పటికి 1900 పాలాశ్రయములు (Dairies) ఉన్నాయట—ఇంచుమించు అన్నీ సహకారపద్ధతి నేర్పడినవే!

డెన్మార్కు ప్రజలలోకలిగిన ఈ పరివర్తనమంతా అచ్చటి విద్యావిధాన జనితమైన క్రమవికాసమేగాని విప్లవ ఫలితంగాదు; ప్రజాయత్నమువల్ల వచ్చినదేకాని అనుల్లంఘనీయమగు ప్రభుత్వపుటాజ్ఞలవల్ల కలిగినదిగాదు; విజ్ఞాన సంపత్తివల్ల చేకూరినదేకాని విజాతీయసలహాలవల్ల లభించినదిగాదు!

సస్యశ్యామల శోభితంబై, సకలసంపదలకాలవాలమై మేరలేని మేధాసంపత్తి గలిగి, పశ్చిమఖండవాసు లంధకారబంధురమున నల్లాడుకాలమున మహోన్నతమైన నాగరకతనుపొందిన భారతదేశము నేడు డెన్మార్కుపాటిచేయకుండెనే! భారతదేశమందుగల జలసమృద్ధి ప్రపంచమున నింకొకదేశమందుగలదా? సస్యసమృద్ధికి తోడ్పడునదులెన్నిగలవు! ఇతరదేశములలో కొన్నికాలములలో భూమియందే సస్యమును లేక బొగులు బొగులుమనుచుండును. మనదేశములోనో—కాలభేదము గణింపక ఎక్కడనో ఒకచోట సస్యములు పండుచునేయుండును. ఇతరదేశములందీపంటలు పండును, ఆపంటలు పండవు అని నియమముకలదు గాని, భారతదేశమందు ఇతరదేశములందు పండుపంటలేగాక, ఆదేశములందు పండని పంటలుకూడ పండును. మనదేశము క్రమక్రమముగా జనాకీర్ణమగుచున్నను, ప్రజలింతకంటె పదిరెట్లు వృద్ధియైనను, పట్టణములు పల్లెలు కట్టుకొనుటకు పంటలు పండించుకొనుటకు అనుకూలమగు భూవసతినియ్యగల మహారణ్యము లెన్నోగలవు. 5,000 మైళ్లు పొడవుగల సముద్రతీరముండుటచే మనదేశం వర్తకానికెంతో అనుకూలంగాఉంది. ఇట్లు వాసయోగ్యమై, నిత్యసస్యభూషితమై, వాణిజ్యమున కనుకూలమగు ప్రదేశమై, సర్వఖనిజధారిణియై తనరారు మన మాతృభూమి నేడు పంటలు పండించి పన్నులు

చెల్లించుకొనుటకు శక్తిలేని రైతులతోను, ఒక్కపూట గుక్కెడు గంజినీళ్లకైన గతిలేని నిర్భాగ్యులతోను, జీర్ణవస్త్రములతో కాలముగడుపు చిల్లరజనంతోను నిండి యుండుటకు హేతువెద్ది?

### విద్యావ్యాప్తిలేమి—ప్రస్తుత విద్యావరిస్థితులందలి లోపము !

నేడు హిందూదేశమున నూటికి పదిమంది అక్షరాస్యులుగూడ లేరున్నారు. ఉన్న అక్షరాస్యులైనా పట్టణములలో నున్నారుగాని పల్లెలందు లేరు. ఈ అక్షరాస్యులలో చాలమంది పొట్టకూటికై బానిసవిద్య నభ్యసించినవారేకాని సంఘశ్రేయస్సునకు తోడ్పడు విద్య నభ్యసించినవారు లేరు. ప్రస్తుత విద్యావిధాన ఫలితముగ దాస్యభావములు, నైచ్యమార్గముల ధనార్జనోద్దేశములుమాత్రము అలవడుచున్నవి; స్వతంత్రపుటాలోచనాశక్తి నశించుచున్నది; విద్యకు పరమావధి ప్రభుత్వదాస్యముగా మాత్రమే పరిగణింపబడుచున్నది. సంఘశ్రేయస్సుకొరకు విద్యాజనితమగు విజ్ఞానము నుపయోగించవలె ననుఉద్దేశమే లేదు !

దేశమందు కొలదిమంది మాత్రమే అక్షరజ్ఞాను లుండుటం జేసియు, నూటికి 95 గురు గ్రామీయులుగానున్న ఈ దేశములో పట్టణవాసులకు మాత్రమే విద్యా సౌకర్యములుండుటచేతను ప్రభుత్వదాస్యమే పరమావధిగా నున్నదికాని, పల్లెటూళ్ల యందుకూడ విద్యాభివృద్ధికి తగిన అవకాశములున్నచో పరిస్థితులు వేరుగా నుండెడివి. కాని పల్లెలందుంటే ఒక ప్రాథమికపాఠశాల ఉంటుంది. తగిన ప్రబోధము లేమింజేసి, ఈ పాఠశాలకుబోవు పిల్లలు గ్రామమందు విద్యాభ్యాసమున కర్హమగు వయస్కులలో నూటికేపదిమందో ఉంటారు. ప్రాథమికవిద్య పూర్తియగువరకు నిలుచువారి పదిమందిలోను అయిదుగురైన ఉండరు. చివరవరకు నిలచినవారిలో ఏ ఒకరిద్దరో మాత్రం ఉన్నతవిద్య నభ్యసించుటకు పట్టణములకు బోవుదురు. మిగిలినవారు విద్యాభివృద్ధి కేవిధమైన అవకాశంలేక నిరక్షరాస్యతలోనికి మరలుతుంటారు. దేశ సౌభాగ్యమున కాధారభూతములై, విద్యాజనితమగు విజ్ఞానమును సజీవసమస్యల నెదుర్కొనుటలో నుపయోగించుట కవకాశము కలిగిన పల్లెటూళ్లలోని విద్యా పరిస్థితు లివి.

పల్లెలందు విజ్ఞానవ్యాప్తికలిగినగాని దేశమార్థికంగాను, సాంఘికంగాను అభివృద్ధిపొందదు. పల్లెటూళ్లయందు ప్రాథమిక పాఠశాలలు నిర్మించినంతమాత్రమున విజ్ఞానం వ్యాప్తినందదు. విద్యాభ్యాసానంతరం నిరక్షరాస్యతలోనికి మరలకుండుటకును, స్వయంకృషిచే జ్ఞానము నభివృద్ధిచేసికొనుటకును తగిన గ్రంథాలయ నిర్మాణంకావాలి. ప్రస్తుతంలో అచ్చటచట పల్లెలలోను, ఇంచుమించు పట్టణము లన్నిటిలోను సర్వజనీన గ్రంథాలయములున్నవి. అవి డెన్మార్కులోవలె ఒక

దానితో నొకటి సంబంధించిలేవు. వ్యక్తిగతంగానైన ఉపయోగపడే స్థితిలోలేవు. పక్షకక్షులకాహుతియగుచున్నవి కొన్ని, తగిన ప్రబోధములేమి జనాదరణలేకపోవుట సరిగదా దుర్వినియోగము చేయబడుచున్నవి కొన్ని, చేతగానితనముచే సరియైన మార్గమునందుంచబడనివి కొన్ని, ధనాభావముచే తగిన పరిస్థితులలో నుంచుటకు వీలులేనివి కొన్ని—ఇది ప్రస్తుత గ్రంథాలయముల పరిస్థితి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ మీదుర్భరపరిస్థితుల రూపుమాపి, ఉన్న గ్రంథాలయముల నుజ్జీవింపజేసి, క్రొత్తవాటిని స్థాపించుటకు ప్రోత్సహించి, వీటినన్నిటిని అన్యోన్యాశ్రయములగునట్లు చేయ నెంతేని ప్రయత్నించుచున్నది. కాని జనాదరణలేమి ఈకార్యము నెరవేరుట దుస్తరమగుచున్నది. ప్రస్తుత రాజకీయ పరిస్థితులంపు ప్రభుత్వమెంతవరకు తోడ్పడునో చెప్పలేకున్నాము. రాజుతలస్తే కొదువేముందికనుక ప్రభుత్వమే ఈవిషయంలో శ్రద్ధ వహించి, సమాసంజితమగు గ్రంథాలయ నిర్మాణమునకు తగిన శాసనమునుచేయు బాధ్యతవహిస్తే మన ఉద్యమం ఫలోన్ముఖానికి రావడాని కాలస్యముండదు. ప్రభుత్వం సహాయపడడం పడకపోవడం ప్రజలలోనేఉంది. ఇంతింత పన్నులను చెల్లిస్తూన్నమాకు శ్రేయస్కరమగు విద్యాపరిస్థితులనైన కల్పించనినాడు మీ ప్రభుత్వమేలనని గట్టిగా అడిగితే కాదని తోసవేస్తారా ఆజ్ఞానం మనకుండాలిగాని. డెన్మార్కు ప్రజల విద్యాసక్తి, శ్రద్ధ, సహకారబుద్ధి, విజ్ఞానవ్యాప్తిమూలమున నెంతటి క్లిష్టపరిస్థితులనైనను ఎదుర్కొనుటకు కలిగిన అద్భుతశక్తి గమనించండి. కర్తవ్యమూహించండి.

## పంచాయతీ గ్రంథాలయాలు—ప్రభుత్వపుటుత్తరువులు

ప్రభుత్వం జాతీయవాదులచేతులందు లేనిరోజులలోపుట్టిన మదరాసు ప్రభుత్వంవారి 85 వ సర్క్యులరు 213 వ సర్క్యులసులు గ్రంథాలయోద్యమంపట్ల పంచాయతీబోర్డుల యాదరణభావాన్ని అరికట్టినవి. ప్రజలలో ఆందోళనకలిగింది. గ్రంథాలయ సభలలో ప్రభుత్వపుటుత్తరువులను ఖండించుచూ తీవ్రమైన తీర్మానాలు చేశారు. కాని కాంగ్రెసువారు మంత్రిపదవులు స్వీకరించేదాక ఈ ఆందోళన అంతా అరణ్యరోదనమయింది. కాంగ్రెసుప్రభుత్వంవచ్చాక పై ఉత్తరువులను రద్దు చేస్తూ 342 వ సర్క్యులరు వచ్చింది. గ్రంథాలయోద్యమానికి మరల కొంచెము సత్తువచేరింది. కాని ఇంతట్లోకే ప్రభుత్వానికేమి నొప్పితోచిందో పాతసర్క్యులరులను పైకిలాగి క్రొత్తదానికి శలవియ్యడానికి సమకట్టారు. 26—9—39 వ తేదీ గజెట్టులో ప్రభుత్వంవారు ప్రచురించిన చిత్తు నిబంధన ప్రకారం స్థానిక సంస్థల డెప్యూటీఇన్స్పెక్టరుగారి వ్రాతమూలమైన అనుమతి ముందుగ బడయనిదే, ఏ పంచాయతీ బోర్డుగాని గ్రంథాలయముల స్థాపన నిర్వహణములకును, పత్రికలు

తెప్పించుటకును, బోర్డుసొమ్మును వ్యయము చేయరాదని ఉన్నది. ప్రజా ప్రాతినిధ్యముచేనేర్పడిన పంచాయతీల ఆత్మగౌరవమునకిది యొక కత్తిపేటూ అవమానమూను! విజ్ఞానాభిమానులెవరూ దీని కాక్షేపణ తెలుపకుండ ఉండలేరు. ప్రజలకీమాత్రం స్వయం నిర్ణయ పఠనాధికారముండకూడదనుట ప్రస్తుత విద్యాలయములందలి బానిసవిద్యా విధానమునకు దోహదమిచ్చుటకేమోయని తోచుచున్నది. కాకున్న ఈ నిర్ణయముల కర్థమేమిటి ?

## గ్రంథాలయములు—రిజిస్ట్రేషను

ప్రభుత్వం విరాళాలిచ్చినరోజులలో గ్రంథాలయాలెంత బాగా పనిచేస్తున్నా రిజిస్టరుకాకపోతే ఆ ధనసహాయం పొందేటందుకు ఆటంకంగా ఉండేది. ముందు విరాళాలిచ్చినా యీ కష్టము తప్పదుగదా! స్థానికసంస్థలు, ఉదారులగు నితరులు గ్రంథాలయములకు సహాయముచేయుటకు రిజిస్టరు కానియెడల నిరాకరిస్తున్నారు. ఇలా జరగడంలో అర్థం లేకపోలేదు. రిజిస్టరైతే ఉన్న కాపుదల, కాకపోతే గ్రంథాలయానికేమిటీ మరొకసంస్థకేమిటీ ఉండదు. కాని గ్రంథాలయాలు రిజిస్టరుకావడానికేబది రూపాయలు రుసుము చెల్లించాలి. అందుచేత రిజిస్టరయేటందుకు గ్రామగ్రంథాలయాలకు చాల కష్టముగా నుంది. ఇప్పటి కిరువదియైదు సంవత్సరములనుండి ఆ రిజిస్ట్రేషను రుసుమును తీసివేసి, గ్రంథాలయముల నుద్ధరించవలసినదని ప్రజలెన్నోసారులు మొఱపెట్టుకున్నారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవా రెన్నోసారులు తీర్మానాలు చేసి పంపారు. కాని ప్రభుత్వమువారి కిప్పటికికూడ చీమ కుట్టినట్లైన తోచలేదు. పదిరూపాయలతో పుస్తకములు కొనుక్కోలేక పాతపుస్తకాలనే నెమరువేస్తూంటే రిజిస్ట్రేషనుకు ఏబదిరూపాయల నొక్కసారి ఎక్కడనుండి తీసికొనివస్తారు ? ప్రభుత్వానికి ప్రజలలో విజ్ఞానమును వ్యాప్తి నొందించవలెనను సదుద్దేశముంటే, గ్రంథాలయములకు రిజిస్ట్రేషను రుసుమును తీసివేయుటకు వెనుకాడరని ఆశిస్తున్నాము.

# సంఘ సౌభాగ్యం

పుణ్యమూర్తి

సంఘసౌభాగ్యం భౌతిక సంపదమీదకంటె బుద్ధివైభవంమీద ఎక్కువ ఆధారపడి ఉంటుంది. సదా మెలకువతో కృషిచేస్తే మానసికక్షేత్ర మత్యుత్తమమైన ఆర్థికసంపద నిస్తుంది. ఈకృషికి గ్రంథములే నాగళ్ళు. గ్రంథములు సంఘానికి చేకూర్చే సంపద అద్భుతమైనది. గ్రంథాల యింద్రజాలం పల్లెటూరి ప్రజలలో నెట్టి పరివర్తన జనింపజేసి పురోగాముల జేయునో డెన్మార్కు చరిత్ర ప్రదర్శించుచున్నది.

## డెన్మార్కును చూడండి!

అనేక విషయాలలో డెన్మార్కు ప్రజలు దక్షిణ భారతీయులను పోలియున్నారు. డెన్మార్కు సారస్వతం మన సారస్వతం వలెనే మనోరంజకమగు మృదుమధురమైన గీతములతో తొలకాడుతోంది. ద్రవిడ సంగీతమందును, డెన్మార్కు సంగీతమందునుకూడ రసోత్సేకము, నాజూకుతనము కనబడతాయి. మనవలెనే డెన్మార్కు ప్రజలును కర్షకులె. వారికి భూసారమొసగు ఫలమెగాని స్వాభావిక సంపద లేమియులేవు. దీనికి సాయం మనకులేని కొరత ఒకటి డెన్మార్కు ప్రజల కున్నది. వారిభూములు మనభూములవలె సారవంతమైనవికావు. అయినను డెన్మార్కు ప్రజలు పలువిధములగు పంటలు పండించి వాణిజ్యప్రపంచమందు పేరెన్నిక నొందుచున్నారు. దీనికి కారణం? సర్వజనోపయోగమగు ప్రాథమిక విద్యావిధానముతో నారంభింపబడి, కడు నేర్పుతో సమాలంబనమై సాగుచున్న సర్వజనీన గ్రంథాలయోద్యమమందు లీనమగుచున్న విద్యాసాధనముతో బుద్ధి క్షేత్రాన్ని సాగుచేసి సారవంతమగునట్లు చేయుటే!

## గ్రంథాలయాల గొలుసు

డెన్మార్కునందు జాతీయ గ్రంథాలయ నిర్మాణమొక గొలుసుకట్టులా ఉంటుంది. గ్రంథముల సేకరించి సరఫరా నిమిత్తం నిలవచేయుటకు కోపెన్హాగన్లో ప్రభుత్వముచే నిర్మింపబడిన రాయల్ లయబ్రరీ, యూనివర్సిటీ లయబ్రరీ ఈగొలుసు నారంభించుచున్నవి. దేశమందంతట వెదజల్లబడియున్న 800 గ్రామగ్రంథాలయము లీ గ్రంథ సంచితస్థానములతో లంకెపెట్టబడి యున్నవి. రాజధానిలోని గ్రంథసంచితస్థానములను, దేశమందలి గ్రామగ్రంథాలయములను కలుపుచు మధ్య 80 పట్టణగ్రంథాలయము లున్నవి. వీటిలో నిరువదిఏడు పలుతావులకు కేంద్రముగానుండు

స్థలములం దమర్పబడియున్నవి. ఈ ఇరువదియేడును మాండలిక సంచితస్థానములుగా పనిచేయుచున్నవి. పాఠకులెచ్చటనున్నను ఒక గ్రంథాలయముద్వారా మరేగ్రంథాలయమునుండియైనను పుస్తకముల నెరువుతీసికొనుటకు చక్కని సదుపాయము లున్నవి. డెన్మార్కునందలి గ్రంథాలయములను జాతీయ వాతావరణమున ముంచి, పెంచి, వాటి యభివృద్ధిబాధ్యతనంతను స్టేట్ లయబ్రరీ డైరెక్టరుచేతిలో నుంచిన 1920 వ సం॥రపు గ్రంథాలయచట్ట ఫలితమే ఈ అద్భుతమైన గ్రంథాలయ నిర్మాణోద్యమము.

## ఈమధ్యనే జరిగినది !

తొణకు బెణుకులేని ఈ సజీవ గ్రంథాలయ నిర్మాణ పద్ధతి బుద్ధిసంపత్తిని అత్యద్భుతమైన అభివృద్ధిలోనికి తీసికొనివచ్చినది. బుద్ధిసాధనమెంత అమూల్యమైనదో ఇటీవలనే సంభవించిన ప్రపంచపుటార్థికమాంద్యపు దినములలో మహామహిమతో ప్రదర్శింపబడినది. 1929 వ సంవత్సరములో వ్యవసాయపు పెట్టుబడియందు నూటికి 5 చొప్పున వడ్డీ కిట్టగా, 1931 వ సంవత్సరమందు కలిగిన క్లిష్టపరిస్థితులమూలమున 1932లో నూటికి ½ నష్టము వచ్చినది. కాని దేశమెల్లెడలను సమాహితముగ నడపబడుచున్న గ్రంథాలయనిర్మాణపద్ధతిమూలమున సాధ్యమైన, ఎడతెగని స్వయంకృషి విద్యావిధానము పుణ్యమా అంటూ ఏసీనుల కలవడిన కోలుకొనుశక్తిఫలితముగ 1936 వ సంవత్సరమున నూటికి 3½ వడ్డీ తీయగలిగిరి.

## సందేశం

అవును. రూపాయలణాలపైసలలోనికి అపారమగు బుద్ధిసంపద నెట్లు మార్చవలెనో మనలో చాలమంది ఆలోచించుటలేదుకాని భౌతికసంపదయొక్క ఆర్థికభాగ్యముకంటె బుద్ధివైభవముచే నుత్పత్తియగు ఆర్థికసంపద విలువ ఎంతయో గొప్పది! ప్రజలకు గ్రంథాలయ సౌకర్యములున్నచో వారి ఆర్థికసంపద ఎట్లు అభివృద్ధిచెందునో డెన్మార్కుచరిత్రవల్ల విశదమైనది. తా వెలువడిన వత్సరమునకు 'ఆంధ్రగ్రంథాలయ' మియ్యవలసిన సందేశ మిదియే. ఆ సందేశమును నాతరఫున, మదరాసు గ్రంథాలయసంఘపక్షమున నావ్యక్తిగతమైన విజ్ఞప్తితో బలపరచుట కొసంగిన ఈ అవకాశమున కెంతయు సంతసించుచున్నాను. మన మాతృభూమియగు నీ పవిత్ర భారతదేశమందంతటను భావగర్భితమగు నీ సందేశసారము సత్వరములో ననుభవమునకు వచ్చునట్లు దైవ మనుగ్రహించుగాక !

(యస్. ఆర్. రంగనాథన్‌గారి కల్చివేషన్ ఆఫ్ ఎ కమ్యూనిటీ అను వ్యాసమునను సరించి)

---

# ఆసియాఖండ గ్రంథాలయ సంఘములు

శ్రీ పాతూరి నాగభూషణం డిప్. లిబ్.
ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి

## ౧. చీనాదేశము

ప్రపంచములోని ఖండము లన్నిటిలో ఆసియాఖండము పెద్దది. ఇందుచీనాదేశము జనాభాయందేగాక ప్రాచీన నాగరకతయందును ప్రపంచమున నగ్రస్థానము వహించి యున్నది. చారిత్రకముగ నీదేశము విజ్ఞాన వ్యాప్తికి దారితీసినట్లు చెప్పబడుచున్నది. ముద్రణావిధాన మిచ్చటనే ప్రారంభమైనట్లును, 1750 వ సం॥ నాటికి ప్రపంచమున గల తక్కినభాష లన్నిటిలో కలసి యున్నవానికంటె చీనాభాషలో నెక్కుడు గ్రంథము లున్నట్లును, 1850 వ సం॥ నాటికి సహితము మరేభాషలోను చీనాభాషలో నున్నన్ని గ్రంథములు లేనట్లును వినుచున్నాము. ఇప్పటికి చాలకాలము క్రితమే ప్రపంచమందలి యేభాషయందుగాని నింతవరకు వెలువడని సాటిలేని ఉద్గ్రంథము— 11,000 సంపుటముల విశ్వకోశ మొకటి చీనాభాషయందు తయారైనది. మరియు క్రీస్తుకు పూర్వము 7 వ శతాబ్దములోనే చీనాలోని రాజమందిరములలో గొప్పగొప్ప గ్రంథాలయము లున్నట్లును తెలియుచున్నది. పదిసంవత్సరముల క్రితముకూడ చీనాలోని షాంఘై పట్టణమున ప్రపంచమునకెల్ల పెద్దపుస్తకప్రచురణాలయ ముండెడిది.

## గ్రంథాలయసంఘముల పుట్టుక

చాలకాలముగ విజ్ఞానాభివృద్ధి కాలవాలముగనున్న చీనాదేశమున గ్రంథాలయోద్యమ ప్రచారము నేడెట్లు సాగుచున్నదీ తెలిసికొను టవసరము. దీనికిగా నీదేశమున బయలుదేరిన గ్రంథాలయసంఘముల పుట్టుపూర్వోత్తరముల సరయుదము. ప్రపంచములోని తక్కిన దేశములందువలెనే చీనాయందలి గ్రంథభాండాగారులును తమలో పరస్పరస్నేహసహకారములు పెంపొందుటకై వివిధసంఘములుగ నేర్పడిరి. ఇట్లేర్పడిన గ్రంథాలయసంఘములు మూడురకములుగనున్నవి.

1. చీనాదేశమున కంతటికిచెందిన జాతీయసంస్థయగు 'చీనాదేశ గ్రంథాలయ సంఘము.'

2. వేరువేరు రాష్ట్రములందేర్పడిన రాష్ట్రీయగ్రంథాలయసంఘములు.

3. పెద్దపెద్ద ప్రాంతములందుగాని సర్వసాధారణముగ నగరములందు గాని స్థాపింపబడిన స్థానిక గ్రంథాలయసంఘములు.

1922 వ సం॥ లో చీనా జాతీయవిద్యాభివృద్ధి సంఘ యాజమాన్యమున గ్రంథాలయశిక్షణ, గ్రంథాలయాభివృద్ధినిగూర్చి విచారించుటకై కమిటీయొకటి యేర్పాటుచేయబడెను. చీనాయందంతటను గ్రంథాలయోద్యమమును విరివిగ సాగించుటకై జులై 22 వ తేదీన నచ్చటి ప్రధానవిద్యాసంస్థల గ్రంథభాండాగారులు కూడి కొన్ని తీర్మానములగావించిరి. చీనాయందలి వివిధ రాష్ట్రములలోగల ప్రధాననగరములందలి గ్రంథభాండాగారులు, స్థానిక గ్రంథాలయ సంఘముల నేర్పాటు చేయవలసినదిగ కోరు తీర్మానము వీనిలోనొకటి. వీనిస్థాపనతో కొంత కాలమునకు గ్రంథాలయోద్యమాభివృద్ధి నిమిత్తమై దేశమందంతట పనిచేయు నొక జాతీయసంస్థ స్థాపింపబడుననియు నీతీర్మానమాశించెను. ఈ యాశ ఫలించుట కెక్కువకాలము పట్టలేదు. పై తీర్మానముప్రకారము కొలది కాలములో వివిధ రాష్ట్రములలోని చాల నగరములందు స్థానిక గ్రంథాలయసంఘములును, 1925వ సం॥లో చీనాదేశ గ్రంథాలయసంఘమును ప్రారంభింపబడెను.

1925 వ సం॥ మార్చినెలలో పెకింగునగరములో ఉద్యమాభిమానులు కొందరు సమావేశమై పై సంఘమును స్థాపింప నిశ్చయించుకొనిరి. ఏప్రిల్ నెలాఖరున దీని నిర్మాణనిబంధన లంగీకరింపబడి కార్యవర్గ మేర్పాటు చేయబడెను. ప్రారంభోత్సవము మాత్రము జూన్ 2 వ తేదీ పెకింగ్ నగరమున యథాక్రమముగ జరుపబడెను. ఈసందర్భమున విఖ్యాత గ్రంథాలయనేతయు, అమెరికాదేశ గ్రంథాలయ సంఘ ప్రతినిధియు నగు డాక్టరు ఆర్థర్ ఇ. బాస్ట్విక్ అనునాత డచ్చట హాజరయ్యెను. చీనాదేశ గ్రంథాలయముల పరిస్థితుల నారసి నివేదించుటకై ఇత డాదేశమునకు చైనాఫౌండేషన్ ధర్మసంస్థవారిచే నాహ్వానింపబడెను.

## చీనాదేశగ్రంథాలయసంఘనిర్మాణము

చీనాదేశ గ్రంథాలయసంఘము ప్రారంభమైనప్పుడు 15 మంది సభ్యులతో కూడిన పాలకవర్గమును, ముగ్గురు సభ్యులుగల కార్యనిర్వాహకసంఘమును గలిగి యుండెను. కాని 1929 వ సంవత్సరంలో నాన్కింగ్ నగరమున సమావేశమైన ప్రథమవార్షిక మహాసభలో కమిటీ విధాన మంగీకరింపబడి కార్యనిర్వాహకసంఘ సభ్యత్వము 15 కు పెంచబడెను. పాలకవర్గముస్థానే 9మంది సభ్యులతో కూడిన తనిఖీసంఘ (సూపర్వైజరీ కమిటీ) మేర్పాటు చేయబడెను. వీరందరును సభ్యులచే నెన్నుకొనబడుచుండిరి. సంఘకార్యక్రమమునకు సంబంధించిన శాస్త్రీయవిషయముల

నిర్వహించునిమిత్తము, కార్యనిర్వాహకసంఘమువారు వివిధవిషయములను గూర్చి శ్రద్ధవహించుటకై పదునొకండు ప్రత్యేకోపసంఘముల సృష్టించిరి.

## సభ్యత్వము

1925 వ సం॥లో 200 మంది సభ్యులతో ప్రారంభమైన ఈ సంఘమున 1935 నాటికి 739 మంది సభ్యులు చేరిరి. ఇందు గౌరవసభ్యులు 31 మందితో చేరి వ్యక్తులు 481; సంస్థలు 258. దీనిలో గ్రంథాలయ నిర్వహణయందు నిమగ్నులైన శాస్త్రవేత్తలే సభ్యత్వము నొందవలెనను నియమములేదు. గ్రంథాలయోద్యమమన్నను, గ్రంథాలయ శాస్త్రాభివృద్ధియన్నను ఆదరాభిమానములున్న ప్రతియొక్కరు చీనాదేశ గ్రంథాలయసంఘసభ్యులు కావచ్చును. వీరు ముఖ్యముగ నైదువిధములుగ నుందురు.

1. సంవత్సరమునకు 2 డాలర్లు చెల్లించు వ్యక్తులు.
2. సంవత్సరమునకు 5 డాలర్లు చెల్లించు సంస్థలు: గ్రంథాలయములు, స్థానిక, రాష్ట్రీయగ్రంథాలయ సంఘములు ఇందు చేరును.
3. యావజ్జీవ సభ్యులు : ఒకేసారి 50 డాలర్లు చెల్లించు వ్యక్తులు; 100 డాలర్లు చెల్లించు సంస్థలు.
4. పోషకసభ్యులు : 100 డాలర్లు విరాళమునిచ్చువారు.
5. గౌరవసభ్యులు : గ్రంథాలయోద్యమమునకు ప్రసిద్ధమగు సేవజేసిన వారు గౌరవసభ్యులుగ నెన్నుకొనబడెదరు.

## సంఘకార్యక్రమము

గ్రంథాలయస్థాపన, నిర్వహణములకు దోహదమునిచ్చుచు, దేశము నలుమూలలగల వివిధ గ్రంథాలయములమధ్య పరస్పర సహాకారమును పెంపొందించు నాదర్శముగల చీనాదేశగ్రంథాలయసంఘ కార్యక్రమము నొకింత పరికింతము. ఆదేశపు ప్రభుత్వ మీసంఘము నూతనముగ స్థాపింపబడినప్పుడు ప్రారంభఖర్చులకుగాను 5,000 డాలర్లు విరాళమునిచ్చెను. ఇంక దీని నిత్య నిర్వహణమున కగు వ్యయము సభ్యత్వచందాలవలనను ఇతరవిధముల నప్పుడప్పుడు లభించు విరాళముల మూలమునను భరింపబడుచున్నది. దీని ఖర్చులకుగాను శాశ్వతమగు నేర్పాటులకై ప్రయత్నములు చేయబడెను గాని యవి ఫలింపలేదు.

దీని కార్యాలయము పీపింగ్ నగరమునగల జాతీయగ్రంథాలయ భవనమున నుంచబడియున్నది. దీనియందు వేతనముపైపనిచేయు కార్యదర్శితోచేరి నలుగు రుద్యోగులున్నారు.

## మహాసభలు

ఈ సంఘము స్థాపింపబడినప్పటినుండి ఇప్పటికి 3 మహాసభలుమాత్రము జరిగినవి. ఇందు మొదటిసభ 1929 వ సం॥ జనవరి 28 వ తేదీనుండి 1 వ ఫిబ్రవరి వరకు నాన్‌కింగ్ విశ్వవిద్యాలయమున సమావేశ మయ్యెను. ఈసభ కచ్చటిజాతీయ ప్రభుత్వము, మహాసభాప్రతినిధుల కఖండస్వాగతము నిచ్చుటయేగాక, ఆర్థికముగను సాయపడెను. దేశమునందలి వివిధప్రాంతముల నుండి 179 మంది ప్రతినిధు లీసభ నలంకరించిరి. గ్రంథాలయ నిర్వహణ విధానములకు సంబంధించిన ముఖ్యములగు ననేక సమస్యలపై సంపూర్ణమగు చర్చలుజరిగి, చక్కని పరిష్కారములు చేయ బడెను. మొత్తముపై నీమొదటిసభ దిగ్విజయముగ ముగిసెను.

రెండవసభ 1933 వ సం॥ వేసవిలో పీపింగ్ నగరమునందలి జాతీయ విశ్వ విద్యాలయావరణమున నడచెను. దేశమునగల ముఖ్యులగు గ్రంథభాండాగారు లనేకు లీసమావేశమున పాల్గొనిరి. ఈ సభయు మిగుల నుత్సాహముతో పరిసమాప్త మయ్యెను.

మూడవసభ ఈ సంఘముయొక్క దశమ వార్షికోత్సవ సందర్భమున 1935వ సం॥ లో నాన్‌కింగ్ పట్టణమున నత్యంత వైభవముగ నడచెను.

## ప్రచురణములు

చీనాదేశ గ్రంథాలయ సంఘపక్షమున ప్రచురింపబడువానిలో ముఖ్యమైనవి 1. సమాచారపత్రిక (బులెటిను) 2. గ్రంథాలయశాస్త్ర త్రైమాసికపత్రిక. ఇవి రెండును సంఘస్థాపననాటినుండియు నడుపబడుచున్నవి. ఇందు మొదటిదగు సమా చారపత్రిక సంఘకార్యాలయమునుండి బయల్వెడలుచు సంఘవృత్తాంతములను, గ్రంథాలయ క్షేత్రమునసడచు వివిధానేక కార్యక్రమ సమాచారములను ప్రకటిం చును. ఇక గ్రంథాలయశాస్త్ర త్రైమాసికపత్రిక చీనాదేశ గ్రంథాలయసంఘ ముతోపాటు, దేశమందలి గ్రంథాలయ నిర్వాహకులకును నిజమగు ప్రతినిధియై గ్రంథాలయములకు సంబంధించిన ప్రామాణిక వ్యాసరాజములతోను గ్రంథాలయ శాస్త్రసంబంధమైన ముఖ్యములగు నూతన గ్రంథములపై చక్కని విమర్శనలతోను విరాజిల్లుచు, గ్రంథాలయ శాస్త్రమునందు నిత్యముగలుగుచున్న అభివృద్ధి నెప్పటి

కప్పుడు గమనింపగోరువారి కత్యంతావశ్యకమై యొప్పారుచుండును. శాస్త్రజ్ఞులకే గాక గ్రంథాలయ విద్యార్థులకును, నీపత్రిక అత్యంతోపయుక్తమై ఆనందమును గూర్చునన్న నిందతిశయోక్తి యుండజాలదు.

ఇవిగాక ఈసంఘము చీనాభాషయందలి వివిధ విధములగు గ్రంథముల పట్టికలు, సారస్వత శాస్త్రీయాది ఆధునిక పత్రికలకు సూచికలు, మహాసభల నివేదికలసహితము ప్రకటించి ఉద్యమాభివృద్ధికి చక్కని దోహదముల గల్పించినది.

## స్థానికసంఘములు

కేంద్రసంఘము 4 పర్యాయములు దేశమునందలి వివిధగ్రంథాలయముల పరిస్థితుల పరిగణనముచేసి, దేశమందలి లెక్కలోనున్న గ్రంథాలయము లన్నింటికిని అనేకపర్యాయములు స్థానిక గ్రంథాలయసంఘముల నెలకొల్పుకొనవలసినదిగ హెచ్చరింపులేఖల సంపుచు వచ్చెను. ఈలేఖల ఫలితముగను, వీనికి పూర్వమును నేర్పడిన ఈస్థానిక సంఘములసంఖ్య 1932 వ సం॥ నాటికి యేబదికి మించలేదు. వీనిలో సగము మాత్రమప్పటికి కేంద్రసంఘమున సభ్యత్వము గలిగియుండెను. ఈ స్థానిక సంఘములసంఖ్య నానాటికి దేశమున వృద్ధిజెందుచున్నను, ఇప్పటికిని అనేక స్థలములలో నివి యేర్పడియుండలేదు.

ఈ స్థానిక సంఘములలో ముఖ్యమైనవి పీపింగ్, షాంఘై నగరములందలివై యున్నవి. ఇవి మొదటినుండియు చక్కగ పనిచేయుచున్నవి. పీపింగ్ గ్రంథాలయ సంఘము 1924 వ సం॥ లో నొకసమాచార పత్రికను ప్రకటించుట కారంభము చేసెను. అప్పటినుండి ఈ సంఘము వివిధ గ్రంథాలయములందున్న ఉపయుక్తములగు పలువిషయములనుగూర్చిన సంయుక్త గ్రంథపట్టికలను, స్థానిక గ్రంథాలయములకు సంబంధించిన చరిత్ర, నిర్మాణము, సిబ్బంది, నిర్వహణము మున్నగు వివరముల నుల్లేఖించు గైడులను ప్రకటింపజొచ్చెను. ఇక షాంఘై గ్రంథాలయసంఘము గ్రంథాలయ శాస్త్రసంబంధమగు పాఠ్యపుస్తకములను, ఎడతెగకనడచు నొక సమాచారపత్రికను నడపుచుండెను. గ్రంథాలయశిక్షణమును సహితము ఉత్తర ప్రత్యుత్తరములద్వారా దీని సభ్యులుకొందరు 1932 వ సం॥ ప్రాంతములో నడపుచుండిరి.

ఇట్లేర్పడిన స్థానికసంఘములు ఉద్యమవ్యాప్తిని గావించుటలో కేంద్రసంఘమునకెంతయు సాయపడుచున్నవి. వివిధప్రాంతములలో నేర్పడిన వీని యాదర్శము లీ క్రిందివిధమున నున్నవి.

1. ఉపన్యాసములు, చర్చలు, కరపత్రములు మున్నగు సాధనములద్వారా గ్రంథాలయపాలన కార్యమున నభివృద్ధిజూపుట.

2. ఒకటికి మించిన గ్రంథముల ప్రతులను పరస్పరము మార్చుకొనుట ద్వారాను, గ్రంథాలయము లొండొంటికి తమ గ్రంథముల సరువిచ్చు విధానము వలనను స్థానికగ్రంథాలయముల మధ్య సంపూర్ణ సహకారమును పెంపొందించుట.

3. స్థానిక గ్రంథభాండాగారుల పరిస్థితులు బాగుపడుటకై ప్రజలు వివేకముతో కూడిన ఆదరాభిమానముల చూపునట్లు ప్రోత్సహించుట.

## గ్రంథాలయశిక్షణ

అతి ప్రాచీన కాలమునుండియు చీనాదేశమున గ్రంథాలయములు నిర్వహింపబడుచున్నను, మొదటి దినములలో నిచ్చట గ్రంథాలయ నిర్వహణము ప్రత్యేకమొక వృత్తిగ పరిగణింపబడలేదు. అప్పుడు ప్రాచీనగ్రంథముల పరిచయమున్న వారు గ్రంథాలయ నిర్వహణమున కర్తలుగ నెంచబడుచుండిరి. మున్ముందీ దేశమున నేర్పడిన రాజప్రాసాదములందలి గ్రంథభాండాగారముల రక్షణ యాజమాన్యములు ప్రసిద్ధ పండితులగు 'జేకువాన్' వంశీయుల చేతిలోనుండెను. వీరు రాజదర్బారులలో కార్యదర్శులుగనుండి, దర్బారుకు సంబంధించిన అన్నివిధములగు రికార్డులను భద్రపరచు చుండిరి.

ముద్రణావిధానముతో పుస్తకముల వ్యాప్తియు వృద్ధిచెంది, తద్వారా వ్యక్తులును గ్రంథసంగ్రహణ కార్యక్రమమునకు పూనుటతో, దేశమున రాజప్రాసాదములందేగాక, సామాన్యుల గృహములందును గ్రంథాలయములు విరివిగ వెలసెను. వీని అభివృద్ధితో వీని రక్షణ నిర్వహణ సమస్యలును బయలుదేరి, ఈవిషయమై పలువురు తమతమ మనస్సులకు తోచిన పద్ధతుల నవలంబించు చుండిరి. ఈ విధానములు, పూర్వీకుల అనుభవములు వంశపారంపర్యముగ ఆచరణలోనికి వచ్చెను. కాని గ్రంథాలయ శాస్త్రమును బోధించుటకు ప్రత్యేకపు ఏర్పాట్లాకాలమున లేవు.

ఆధునిక యుగమున నిందువిషయమై జరిగిన పనినిగూర్చి కొంత తెలుపప్రయత్నింతును. చీనాదేశమున ఆధునిక గ్రంథాలయోద్యమాభివృద్ధికై కృషిసల్పిన మేరీ ఎలిజబత్ వుడ్ కుమారి (అమెరికా దేశీయురాలు) 1914 వ సం॥ లో నొకరిని, 1917 సం॥లో నొకరిని గ్రంథాలయ శిక్షణ నిమిత్తము అమెరికా దేశమునకు పంపునేర్పాటుల గావించెను. ఈమె స్థాపించిన 'బూన్ లైబ్రరీ'యందు 1920 వ సం॥ జనవరిలో నొక గ్రంథాలయ పాఠశాల ప్రారంభింపబడెను. ఇదియే చీనాయందు గ్రంథాలయ శిక్షణ నిచ్చుటకై చేసిన మొదటి ప్రయత్నమని చెప్పవచ్చును. తరువాత కొలది మాసములకు గ్రంథాలయ శిక్షణ నిచ్చుటకై పెకింగునగరమునందలి 'హైనార్మల్ కాలేజీ'లో వసంత విద్యాలయమొకటి యేర్పాటు చేయబడెను.

దీనియందు 69 మందిపురుషులు 9 మంది స్త్రీలు విద్యాభ్యాసము చేసిరి. అప్పటి నుండి దేశమునందలి పలు ప్రాంతములలో గ్రంథాలయశిక్షణ కేర్పాటులు విరివిగ జరిగెను. ఇందునిమిత్తము ప్రత్యేకపాఠశాలలేగాక, ఇతర విషయములతోపాటు గ్రంథాలయ నిర్వహణమును సహితము బోధించు విద్యాలయములును చాల వెలసెను.

ఉపాధ్యాయుల కళాశాలలందును, నార్మల్ స్కూళ్ళయందును, గ్రంథాలయ నిర్వహణమును వాని పాఠ్యక్రమములో చేర్చునట్లు చేయవలసినదిగ, చీనా జాతీయ విద్యాభివృద్ధి సంఘమువారి యొకానొక వార్షిక సభలో, విద్యామంత్రిని కోరుచు నొక తీర్మానము చేయబడెను. దీని ఫలితముగ చీనాయందలి చాల పాఠశాలలందును కళాశాలలందును ఐచ్ఛికముగను విద్యార్థుల అవసరమును బట్టియు గ్రంథాలయ పాఠములు నేర్పబడు చున్నవి. ఇట్లే విశ్వవిద్యాలయములందును విద్యార్థుల విద్యావిధానములో గ్రంథాలయశిక్షణ మొకభాగముగ నేర్పడినది. గ్రంథాలయశిక్షణలో భాగమైన గ్రంథనిర్మాణశాస్త్రమునకు సంబంధించిన పూర్వకాలపు పాఠ్యక్రమము, నేటికిని చాలవిశ్వవిద్యాలయములలో నడచుచున్నది. ఇది చీనాదేశపు ప్రాచీనవాఙ్మయమునకు సంబంధించిన పాఠ్యక్రమములో భాగముగ నున్నది.

## బూన్‌గ్రంథాలయ పాఠశాల

చీనాదేశములో గ్రంథాలయనిర్వహణమున పూర్తిశిక్షణనిచ్చు సంస్థ 'బూన్ గ్రంథాలయ పాఠశాల' యొక్కటియే. కళాశాలలం దొకవత్సరము చదివినవారలకు మూడేండ్లపాటీసంస్థలో గ్రంథాలయశాస్త్రము మొదట బోధింపబడుచుండెను. తదుపరి ఈ శిక్షణకాలము రెండేండ్లకు తగ్గింపబడి, కళాశాలలో రెండుసంవత్సరముల చదువును పూర్తిచేసినవారుమాత్రము దీనిని జదువ సర్హులుగ పరిగణింపబడిరి. ఈ పాఠశాల బూన్ విశ్వవిద్యాలయమందలి సారస్వత కళాశాలలో నొకభాగముగ నుండి అమెరికాదేశ గ్రంథాలయ పాఠశాలల ననుకరించుచున్నది. చీనాదేశ విద్యావిజ్ఞానముల అభివృద్ధినిమిత్త మేర్పడిన ధర్మసంస్థ పై పాఠశాలయందలి విద్యార్థుల యొక్కయు, ఉపాధ్యాయులయొక్కయు ఉపకారవేతనములక్రింద వార్షికవిరాళముల నొసగుచున్నది. చీనాదేశ గ్రంథాలయసంఘము యొక్కయు, బూన్ లైబ్రరీ స్కూలుయొక్కయు యాజమాన్యమున పీపింగ్, షాంఘై, నాన్‌కింగ్, కాంటన్, వూచాంగ్ నగరములందు పోటీ పరీక్షలు జరుపబడి అందు తీర్ణులగు విద్యార్థులకు ఉపకారవేతనము లొసంగబడును.

## చీ. దే. గ్రం. సంఘ తీర్మానములు

గ్రంథాలయములు తమవిధుల సక్రమముగ నిర్వహించుట కత్యంతావశ్యక మగు శిక్షణవిషయములో, చీనాదేశ గ్రంథాలయ సంఘము మొదటినుండియు జూపుచువచ్చిన శ్రద్ధను సూచించు క్రింది తీర్మానములు, దీని ప్రథమ వార్షికోత్సవ సందర్భమున చేయబడినవి.

**1.** అప్పటికి గ్రంథాలయోద్యోగులుగ నున్నవారి నిమిత్తము చీ. దే. గ్రం. సంఘ పక్షమున దేశములోని వివిధ కేంద్రములలో వరుసను గ్రంథాలయ శిక్షణ నొసగు తాత్కాలిక పాఠశాలల నిర్వహించుటకును;

**2.** గ్రంథాలయ నిర్వహణమున ఉన్నత శిక్షణము నిమిత్తము కేంద్రప్రభుత్వ విద్యాశాఖవారు, చీ. దే. గ్రం. సంఘమువారు, రాష్ట్రీయప్రభుత్వ విద్యాసంస్థలు, విద్యార్థివేతనముల నేర్పాటుచేసి—అనుభవపరులగు గ్రంథభాండాగారుల నుండిగాని, పోటీ పరీక్షలలో విజయులగు నభ్యర్థులనుండిగాని, ఉభయవర్గముల నుండిగాని విద్యార్థులనేరి—వారిని విదేశములందు చదివి వచ్చుటకైన, నచ్చటి గ్రంథాలయ పరిస్థితుల చూచివచ్చుటకైన పంపుటకును;

1929 వ సం॥ లో నాన్కింగ్ విశ్వవిద్యాలయమున సమావేశమైన సంఘముయొక్క ప్రథమవార్షిక సభలో తీర్మానింపబడెను.

## ౨. జపాను

విస్తీర్ణతయందుగాని, జనాభాలోగాని జపాను చీనాదేశమున కీడురాదు. ప్రాచీన నాగరకత విషయమునను ఈ రెండుదేశములకు సామ్యములేదు. అయినను నేడు జపాను చీనాకంటె అన్నివిషయములందును ముందున్నది. అర్ధశతాబ్దికిపైగ నీదేశము పాశ్చాత్యనాగరికతను బాగుగ జీర్ణించుకొని ప్రాచ్యప్రపంచమునకు రాణిగ వెలయుచున్నది. 1892 వ సంవత్సరమందే ఇచ్చట జపానుదేశ గ్రంథాలయసంఘ మేర్పడినది. ప్రత్యేక వ్యక్తులచేతను, సంఘములద్వారాను నడుపబడు గ్రంథాలయముల సేవకు లొకనాడు టోకియోనగరమున గూడి గ్రంథాలయోద్యమ పరిశీలనా ప్రచారముల నిర్వహించు నిమిత్తము పై సంఘమును స్థాపించిరి. మొదట 29 మంది సభ్యులతో ప్రారంభింపబడిన ఈ సంఘము 1935వ సం॥ నాటికి 1405 మంది సభ్యుల సంపాదించగలిగినది.

## జపానుదేశ గ్రంథాలయసంఘ కార్యక్రమము

విజ్ఞానసంబంధమైన పలువిషయములలో పాండిత్యమును పెంపొందించుటకును, గ్రంథాలయోద్యమ వ్యాప్తికిని, జపానుదేశ గ్రంథాలయసంఘ మొనర్చిన కృషి చాల గలదు. జపానులో నూతనగ్రంథాలయముల స్థాపించుటకును, ఉన్నవాని నభివృద్ధికి దెచ్చుటకును ఈ సంఘము పలువిధముల పాటుపడెను. ఇందునిమిత్త మనేకపర్యాయము లచ్చటి ప్రభుత్వముతో నీ సంఘము సంప్రదించెను. ఉద్యమమునకు క్రొత్త సేవకుల తయారుచేయు సంకల్పముతో తాత్కాలిక పాఠశాలల నేర్పాటుచేసి, ఇందు గ్రంథాలయసంబంధమైన ఉపన్యాసముల నిప్పించుటయే గాక, గ్రంథాలయనిర్వహణమును గూర్చిన మూలసూత్రముల ప్రతిపాదించు నొక ప్రథమపాఠ పుస్తకమును సహిత మీసంఘము ప్రచురించినది. మరియు 'జపాన్ లైబ్రరీ అసోషియేషన్ లైబ్రరీ జర్నల్' అను పేరుతో నొక పత్రికయు దీనిపక్షమున నడచు చున్నది. ఈపత్రిక సంఘ సభ్యులలో నీయుద్యమమును గూర్చి చక్కని ప్రబోధమును గావించు చున్నది. జపాను, చీనాభాషలలో ప్రకటింపబడు గ్రంథములకు పట్టికలను తయారు చేయుటలో ఏకైక విధానమును సాధించనెంచి, ఇందునిమిత్తము కొన్ని నియమములనుకూడ ఈసంఘము గావించియున్నది. బెల్జియం నందున్న 'ఇంటర్నేషనల్ బిబ్లియోగ్రాఫికల్ సొసైటీ' యందు సభ్యత్వము వహించి, దాని కార్యకలాపమునకిది చాలగ తోడ్పడు చున్నది.

## గ్రంథపట్టికలు

**1930** వ సం॥ లో నీ సంఘము జపాను ప్రభుత్వముయొక్క ఆమోదమును బడసినది. నాటినుండి సార్వజనిక విద్యావిషయమై దీని కృషి పెంపొందినది. దేశమున వెలువడు గ్రంథములనుండి ప్రజాసామాన్యము చదువదగిన గ్రంథములనేర్చి, నూతనముగ బయల్వెడలు సద్గ్రంథ పట్టికల నీసంఘము **1931** వ సం॥ నుండి ప్రకటించు చున్నది. ప్రతి గ్రంథమునందును గల విషయముల వివరించు నీపట్టికలు దేశమందంతట ప్రచారము చేయబడుచు, గ్రంథాలయములు తమకు కావలసిన పుస్తకముల నేరుకొనుట కుపయోగించు చున్నవి.

## గ్రంథాలయ సప్తాహములు వగైరా

ప్రతిసంవత్సరము నవంబరు నెలలో దేశమందంతటను జరుపబడు గ్రంథాలయ సప్తాహ మహోత్సవముల వలనను, ఈ సంఘపక్షమున టోకియోలోను, ఇతర స్థలములందును ఏటేట నేర్పాటుచేయబడు వార్షిక గ్రంథాలయసభల మూలమునను,

ప్రజలలో విజ్ఞానదృష్టి, గ్రంథాలయోద్యమాభిమానము పెంపొందుచున్నవి. వీని ఫలితముగ సిద్ధించిన ప్రయోజనములు ముఖ్యముగ రెండు. ప్రత్యేక స్థానికపరిస్థితులకు సంబంధించిన వాఙ్మయము సేకరింపబడి, ఉపయోగమునకు తేబడుట చాల చోట్ల జరిగెను. గ్రంథాలయ నిర్వహణముద్వారా సమాజవిజ్ఞానమును ప్రచారములోనికి దెచ్చుటకై అసంఖ్యాకములగు నూతన సంఘములు దేశము నలుమూలల వ్యాపించెను. గ్రంథాలయ మహాసభలలోను, గ్రంథాలయసేవకుల తదితర సమావేశములందును, స్థానికముగ స్థాపింపబడు ప్రత్యేక గ్రంథాలయముల విషయమై చర్చలు, తీర్మానములు తరచు జరుగుచుండును.

జపానుదేశమందలి గ్రంథాలయములలో చాలభాగము ప్రాచీనపద్ధతులనదగు ప్రదర్శనవిధానములు, సార్వజనికోపన్యాసములు, చలనచిత్రముల యేర్పాటులేగాక-సంచారభాండాగార నిర్వహణము, ప్రత్యేకవిషయములపై ప్రవీణుల ఉపన్యాసములు మున్నగు ఆధునిక విధానముల నవలంబించుట కీ సంఘముయొక్క ప్రోత్సాహమే కారణము. 1932 వ సం॥ లో జరిగిన జపాను గ్రంథాలయ మహాసభలో ఏప్రిల్ 2 వ తేదీ ప్రతిసంవత్సరము గ్రంథాలయ విజయోత్సవమును జరిపి ప్రజలు గ్రంథాలయోద్యమ వ్యాప్తికి తోడ్పడునట్లు కృషి సలుపుటకై తీర్మానింపబడెను. 1931 వ సం॥ ఏప్రిల్ 2 వ తేదీ జపాను చక్రవర్తి 'టోకియో' యందలి ఇంపీరియల్ లైబ్రరీ డైరెక్టరును పిలిపించి, గ్రంథాలయముల కార్యక్రమమును గూర్చి తన యెదుట నుపన్యసింప వలసినదిగ నాతని కోరుటచే, దీని జ్ఞాపకార్థము పై యుత్సవమును జపానుదేశ గ్రంథాలయము వారేర్పాటు చేసిరి. చక్రవర్తి తమ యుద్యమము నాదరించుటచే, దేశమునందలి గ్రంథాలయ సేవకులందరును పైతీర్మానము నేకగ్రీవముగ నప్పటినుండి ఏమరక అమలుపరచు చున్నారు.

## ప్రభుత్వవిద్యాశాఖ – గ్రంథాలయపాఠశాల

జపానుదేశ గ్రంథాలయసంఘ కార్యక్రమమునకు తోడ్పాటుగా గ్రంథాలయ సేవకులకు శిక్షణనొసగు నిమిత్తము 1921 సం॥ లో నచ్చటి ప్రభుత్వమువారు 'విద్యాశాఖ గ్రంథాలయ పాఠశాల' నొకదానిని ప్రారంభించిరి. ఈ పాఠశాల ప్రతి సంవత్సరము ఏప్రిల్ మాసారంభమున ప్రారంభమై సంవత్సరముపాటు నడచును. ఇంపీరియల్ లైబ్రరీ భవనమున నడుపబడు నీపాఠశాలలో ఏటేట స్త్రీ పురుషులు కలసి 25 మొదలు 30 మందివరకు విద్యాభ్యాసము చేయుచుందురు. మాధ్యమిక పాఠశాలలోను,స్త్రీల ఉన్నతవిద్యాలయములందును చదువుపూర్తిజేసి పట్టభద్రులైన వారుమాత్ర మీపాఠశాలలో చేర్చుకొనబడుదురు. ఇందు గ్రంథాలయములకు సంబంధించిన ప్రత్యేక శాస్త్రీయ విషయములు, సమాజవిజ్ఞానము, భాషలు

బోధింపబడును. దీనికితోడు ప్రభుత్వ విద్యాశాఖవారు గ్రంథాలయ నిర్వహణము నకు సంబంధించిన కొలదిపాటి ప్రణాళికతో తాత్కాలిక పాఠశాలలను సహితము ప్రారంభించిరి. ఈ మార్గ మచ్చట పలువుర కాదర్శమయ్యెను.

## ఇతరసంఘములు

దేశమునందంతటను పనిచేయు జ. దే. గ్రం. సంఘము 1915వ సం॥ నుండియు పలుప్రాంతముల శాఖాసంఘముల నిర్మించుచు వచ్చెను. ఇవియన్నియు కేంద్రసంఘ కార్యక్రమమునకు బలమును గలిగించు పనుల చేపట్టి నడపుచుండును. ఇట్టివానిలో ముఖ్యమైనవి:—

1. సామ్రాజ్యమందలి ముఖ్యగ్రంథాలయ సంఘము. ప్రతి మండలమునందు గల పెద్దగ్రంథాలయము లేక మండల కేంద్రగ్రంథాలయము, స్థానిక గ్రంథాలయ ముల నభివృద్ధికి దెచ్చుటకై చిన్నగ్రంథాలయములకు సహాయపడుచు, వానిమధ్య పరస్పర సహకారమును పెంపొందించు చుండును. 1930 వ సం॥ లో సీమండల కేంద్ర గ్రంథాలయము లన్నియు టోకియోయందలి ఇంపీరియల్ లైబ్రరీ ఆధ్వర్య మున సమావేశమై దానిని కేంద్రముగ జేసికొని పై సంఘమును స్థాపించెను. స్థానిక కేంద్ర గ్రంథాలయములకు సంబంధించిన సమస్యల బాగుగ పరిశీలించి, వాని అభి వృద్ధికి పాటు పడుటయే ఈసంఘాదర్శము.

2. మండల లేక ప్రాంతీయ గ్రంథాలయసంఘములు. కొలదిసంవత్సరములుగ జపాను నందలి మండలగ్రంథాలయ సంఘములసంఖ్య నెమ్మదిగ నభివృద్ధి జెందు చున్నది. మండలముల వైశాల్యమునకు మించిన ప్రదేశములలో నేర్పడిన సంఘ ములలో ఉత్తర హాన్షూ, హొంకెయిడో ప్రాంతీయ సంఘమును (1928), షైవాక్ గ్రంథాలయ సంఘమును (1927), షికోకూ గ్రంథాలయ సంఘమును ప్రధానమైనవి.

3. బాల భాండాగారుల సమాజము. ఇది 1927వ సం॥ లో స్థాపింపబడినది. గ్రంథాలయముల అభివృద్ధికై పాటుబడుట, దీనికవసరమైన అధ్యయనమును గావిం చుట, ఈ సమాజముయొక్క ప్రధానోద్దేశములు. ఇందునిమిత్తము వీరు నడపుచున్న త్రైమాసిక గ్రంథాలయపత్రికసేవ జపాను గ్రంథాలయోద్యమమునకు చక్కని చేయూతగ నున్నది.

## ౩. ఫిలిప్పైనుదీవులు

ఫిలిప్పైనుదీవులు చీనాదేశమున కాగ్నేయపు దిక్కున దక్షిణచీనా సముద్ర మధ్యమున నున్నవి. ఈదీవులందలి జనాభా మొత్తము 1 కోటి 21 లక్షకు పైన

గలదు. 1923 వ సం॥ నవంబరులో స్థాపింపబడిన ఫిలిప్పైను గ్రంథాలయసంఘము 1929 వ సం॥ లో అంతర్జాతీయ గ్రంథాలయసంఘ సమాఖ్య (ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ లైబ్రరీ అసోసియేషన్స్) యందు సభ్యత్వమును సంపాదించెను. 1931 సం॥ మే మాసమున అప్పటికి నూతనముగ నిర్మింపబడిన ఫిలిప్పైను యూనివర్శిటీ గ్రంథాలయ భవనమున ఫిలిప్పైను గ్రంథాలయసంఘ యాజమాన్యమున గ్రంథాలయ మహాసభయొకటి యేర్పాటు చేయబడెను.

ఈకేంద్రసంఘమునకు తోడుగ నీదీవులలో స్థానిక సంఘములు కొన్ని వెలసినవి. వీనిలో ముఖ్యమైనది 'ఫిలిప్పైను యూనివర్శిటీ లైబ్రరీ క్లబ్'. 1926 వ సం॥ స్థాపింపబడిన ఈసమాజము తన సభ్యులతోపాటు తక్కిన దేశీయులును గ్రంథాలయముల ఆవశ్యకతను గుర్తించునట్లు చేయగలిగెను. 'లైబ్రరీ మిర్రర్' అను చిన్న పత్రికను సహిత మీసంఘము ప్రకటించెను. ఈపత్రిక 1895—96 సం॥ లలో 17 నెలలుమాత్రము నడచి అంతరించెను. 1912 వ సం॥ సెప్టెంబరు మాసమునుండి 1916 వ సం॥ ఆగష్టువరకు 'ఫిలిప్పైను లైబ్రరీ బులెటిన్' అను మరియొక మాసపత్రికయు నీదేశమున ప్రకటిత మయ్యెను. గ్రంథాలయములకును, గ్రంథనిర్మాణ శాస్త్రమునకును సంబంధించిన విషయముల ప్రకటించు పత్రికయొకటి సంఘపక్షమున 1935 వ సం॥ నకు తర్వాత ప్రారంభింప బడినట్లు తెలియుచున్నది.

# ప్రయోజన విద్యాప్రచారము

*'To carry knowledge free to the doors of the ignorant, to educate them in the righteous path: nothing can be equal to that form of charity; even to give away the whole world can never come to its level'* — *Manu.*

అజ్ఞానులకు విద్యగఱపుట మహాపవిత్రకార్యం. దీనికి మించిన ధర్మకార్యం మరొకటి లేదు. భారతదేశమున నిప్పుడు నూటికి తొంబదికి పైగా నిరక్షరాస్యులే. వారికి ప్రస్తుత ప్రపంచ పరిస్థితులేమీ అర్థంకావు. సాంఘికంగాకాని, రాజకీయంగాకాని వారు తమ బాధ్యత గుర్తించలేరు. అట్టి యజ్ఞానముచే దేశమునకు కలుగుచున్న యనర్థకములు విద్యాధికు లెఱుంగనివికావు. కాన నీ యజ్ఞానులకు విద్యగఱపుటే విద్యాధికుల ధర్మం.

దేశమందెల్లెడల విద్యావ్యాప్తి కలిగినగాని, ప్రస్తుత పరిస్థితులనుండి నిజమగు విముక్తి కలుగదు. రాజకీయంగాకాని, సాంఘికంగాకాని, నైతికంగాకాని, ఆధ్యాత్మికంగాకాని ఎట్టి సంస్కరణలు తలపెట్టినను, విద్యావ్యాప్తి కలుగనంతవరకు అవి కృత్రిమ పునాదులమీద నిలువవలసినదే. ఏగాలిపాటున కవి ఎట్లుపరిణమించునో!...!

విద్య నేర్వనివారు పసివారలందును, పెద్దలందునుగూడ నున్నారు. పసివారల కొఱకు ప్రాథమిక పాఠశాలలు నెలకొల్పబడుచున్నవి. కాని నిర్బంధము లేమి, తలిదండ్రు లనేకులు తమబిడ్డల పాఠశాలకు బంపుటలేదు. కాన ప్రాథమిక విద్య నిర్బంధము కావలెను. నిర్బంధం చేయడంలో కొన్ని కష్టాలున్నాయి. కుటుంబ పోషణార్థం పసిపిల్లలచేగూడ పొలములందు పగలు పనిచేయించుకొనవలసిన బీద లనేకు లున్నారు. వారికొఱకు రాత్రి పాఠశాలలు అవసరం. ప్రాథమికవిద్య పూర్తి కాగానే, పాఠశాలలను వదలినవారు నేర్చినవిద్యను స్వయంకృషిచే తీరికసమయము లందభివృద్ధి జేసికొని, నిత్యజీవిత సమస్యల నెదుర్కొనుటకు తగిన విషయములను తెలిసికొనవలెను. కాని తగిన సదుపాయములులేమి, నేర్చిన విద్య అభివృద్ధి చేసికొను టటుండగా నిరక్షరాస్యతలోనికి మరలు చున్నారు. స్వయంకృషిచే నభివృద్ధి చేసికొను వారికి గ్రంథములే ప్రధానాధారముగనుక గ్రంథసంచయకారులును, సర్వజనీన గ్రంథ సేవా నిర్మాతలునగు గ్రంథపాలకులే యీబాధ్యతను వహించవలసియున్నది. జీవిత మంతయు తెంపులేకుండ సాగవలసిన ఈ స్వయంకృషి విద్యా విధానమును సదుపుటలో గ్రంథాలయముల అవసర ప్రాముఖ్యతలను గుర్తించినవారు, ప్రతి యూరను ప్రాథమిక పాఠశాలలతోబాటు గ్రంథాలయమునుగూడ స్థాపించవలసి యుండును. నిరక్షరాస్యులగు వయోజనులు గ్రంథాలయముల నుపయోగించుకొనలేరు. వారి

కొఱకు విద్యాలయముల నేర్పాటు జేసినను పగలు పనిమానుకొని పాఠశాలలకు పోవుట కష్టము. కాన వారికి తీరికగానుండు కాలములందు - వేసవిలోనో, శీతాకాల మందో, ఆయాప్రదేశములందుండు పరిస్థితులనుబట్టి విద్య నొసగుటకు తగిన సదుపాయముల నేర్పాటు చేయాలి. మరొకవిషయం - వయోజనుల విజ్ఞానమును గ్రంథములద్వారా నేర్చుకొనుటకు తగిన తర్ఫీదు నియ్యవలెనను ఉద్దేశముతో అక్షరజ్ఞాను లగువరకు వేచియున్న లాభము లేదు. జాగ్రత్తగ నాలోచించి తయారుజేసిన ఉపన్యాసముల ద్వారా వారికి విజ్ఞానము నందజేయాలి.

విద్యావ్యాప్తి ప్రజలలో నెట్టి పరివర్తన జనింపజేసి పురోగాముల చేయునో డెన్మార్కు చరిత్ర చదివితే తెలుస్తుంది. విజ్ఞానసంపద మూలమున డెన్మార్కు ప్రజ లెట్టి కష్టములనుండైనను గట్టెక్కగల సామర్థ్యం సంపాదించారు. వారికి తమ భూములు నిస్సారమైనవను విచారంలేదు; విజ్ఞానసాధనముతో పలురకముల పంటలు పండించుకొనుచున్నారు. పండించిన పంటలు, తయారుజేసిన యితరములు అమ్ముకొనుట ఎట్లులా అను భయములేదు; విద్యాబుద్ధులగుటచే సహకార సంఘాల నేర్పాటు చేసికొని పని నెరవేర్చుకొనుచున్నారు. పెట్టుబడిసొమ్ము ఎక్కడ తీసికొని వస్తామా అను బెంగలేదు. పరపతిసంఘాల నేర్పాటు చేసికొని సహాయమును పొందవలెనను జ్ఞానము వారికబ్బినది. ఇది అది అని లేదు. విద్యాబుద్ధు లగుటచే డేనులు సర్వవిధముల సౌఖ్యము ననుభవించుచున్నారు.

మన దేశమందీ సందేశము నందుకొన్నారు. సంయుక్త రాష్ట్రములలోను, మధ్యరాష్ట్రంలోను, ఒరిస్సా, బొంబాయి, బీహారు రాష్ట్రములలోను నిరక్ష్యరాస్యతా నిర్మూల నోద్యమం అత్యుత్సాహంతో నడుపుచున్నారు. ఈఉద్యమఫలితం తృప్తికరంగా ఉన్నట్టు వార్తలు వస్తున్నాయి.

పై బేర్కొనిన రాష్ట్రములందు కాంగ్రెసువారు ప్రభుత్వం సాగిస్తున్న రోజులలో ఆ ఉద్యమ మారంభమై వ్యాప్తినొందింది. మదరాసు రాష్ట్రంలో ప్రభుత్వం వారు మరొకవైపునుండి సంస్కరణల ప్రారంభించి, నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమం సాగిద్దామనుకొనేటప్పటికి రాజీనామా లివ్వవలసి వచ్చింది. కనుక మదరాసు రాష్ట్రంలో గవర్నరుగారి సలహాదారు లేమైన అభిమానిస్తేతప్ప, ఎప్పటివలెనే వయోజనులకు విద్యగఱపు బాధ్యత ప్రజలమీదే ఉంటుంది. అందులోను ఆంధ్ర రాష్ట్రంలో ప్రజలే బాధ్యతవహించి వయోజన విద్యాప్రచారం సాగించవలసిందే కాని, కాంగ్రెసువారు మరల పదవులు స్వీకరించినా అరవవారి చేతిలో అధికారమున్నంతకాలం ఆంధ్రుల కేవిధమైన సహాయం జరుగుతుందని తోచదు. ఇంతవరకు కాంగ్రెసు ప్రభుత్వం తలపెట్టిన ముఖ్యమైన కార్యాలన్నీ తమిళ జిల్లాలలోనే ప్రారంభమైనవన్న సంగతీ, వారెక్కొరొకప్పుడీ విషయాన్నే బహిరంగంగా, సగర్వంగా

వెలిపుచ్చారన్న సంగతి ఆంధ్రులు తెలుగకపోరు. మాట ఉండిపోతుందిగాని, అక్షరజ్ఞానోద్యమ విషయంలో ఆంధ్రదేశంలోగల ఉత్సాహం, పట్టుదల యింకే ప్రాంతాలలోను లేదు; బ్రిటిషుహిందూస్థానంలో ముందంజవేసి, పశ్చిమ దేశస్థులనుగూడ దిగ్భ్రమ చెందించునంతటి నేర్పుతో గ్రంథాలయోద్యమము నడపిన ఆంధ్రులకు నేడీ నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమ మొక కష్టమైన పనిగాదు!

---

# వయోజనవిద్య - బోధనాపద్ధతులు*

శ్రీవారు సి. రాజగోపాలాచార్యులుగారు

'అజ్ఞానమును తొలగించుటకూ వయోజనవిద్యకూ చాలా తేడా ఉందన్నారు. ఓనమాలు నేర్పకుండానే నోటి మాటతో అనేకులను విద్యావంతుల జేయవచ్చును. ఇప్పుడు ప్రజలలో అజ్ఞానాన్ని తొలగించడంకన్న వారికి విద్య నేర్పి ఆనందమయులగు పౌరులుగా చేయుట ప్రస్తుతం చాలా అవసరము. కాని యిందులో ఒకదానికోసం ఒకటి కనిపెట్టుకొని ఉండనవసరంలేదు.

ఇప్పుడు జన బాహుళ్యాన్ని విద్యావంతులు చేయడంకన్న వారికి అక్షరజ్ఞానం నేర్పితే యీ ఉద్యమాన్ని వారు గ్రహించుకొని ఆనందింపగలుగుతారు. కనుక వెంటనే హెచ్చుమందికూడి వయోధికులకు అక్షరజ్ఞానము కలిగించుటకై ఒక ఉద్యమాన్ని ప్రారంభించాలి.

చదువురాని వయోధికులకుకూడా చిన్న పిల్లలవలెనే చదవడమూ వ్రాయడమూ చేతకాదు గనుక ఇద్దరినీ ఒక్కవిధంగా చూడకూడదు. పిల్లలకూ పెద్దలకూ విద్యావిషయంలో ఎంతనో తారతమ్యం ఉంటుంది. కాబట్టి మనంజయప్రదంగా పసిపిల్లలకు విద్య నేర్పుటకు ఉపయోగించిన పద్ధతులు వయోజనవిద్యకు ఉపయోగించడానికి వీలులేదు.

మొదటివిషయం చిన్నపిల్లలను బతిమాలో లేక బెదిరించో పాఠశాలకు పంపవలసి వుంటుంది. గాని వయోధికుల విషయంలో అలాగ కాదు. స్వతస్సిద్ధముగా వారికి ఉపాధ్యాయునిదగ్గరకు వెళ్ళి అడిగి తెలుసుకుందామన్న ఉత్సాహం వుంటుంది.

అందుకోసమే పిల్లలను మనము బడికి పంపుతాము. వాళ్ళు రోజూ బడికి వెళ్లుతూనే ఉంటారు కాని వారిలో విద్యాభివృద్ధి కనిపించదు. వయోధికులయితే వాళ్ళకు చదువులో ఎప్పుడు అభివృద్ధి కనిపించదో వెంటనే యికలాభంలేదని వదిలిపెట్టేస్తారు.

వయోధికులకు త్వరగా విద్య నేర్చుకునే పద్ధతులు కావాలి కాని పసిపిల్లలకు నేర్పినట్లుగా కథలుచెప్పడం మొదలుపెట్టితే యిదంతా కేవలం కాలయాపనఅని వయోధికుడు భావిస్తాడు.

అతనికి ఆడుకోవాలన్న సరదా ఉండదు. పూర్తిగా అంత కాలాన్ని విద్యకే వినియోగిద్దామని అతడు అభిలాషపడుతాడు. కాబట్టి ఉపాధ్యాయుడు వయోధికులకు ఇతర ఆకర్షణలేమీ అవసరం లేకుండా విద్య నేర్పడానికి పూనుకోవాలి.

పిల్లలకు చదువు చెప్పేటప్పుడు ఉపాధ్యాయులు అరవడం, అధికారం చూపడం మొదలైన పనులు చేస్తారు. కాని పెద్దలకు చదువు నేర్పునప్పుడు గట్టిగా కేకలు వేయడం అవసరం లేకుండా నెమ్మదిగానే స్పష్టముగా ఉచ్చారణ నేర్పాలి.

---

* 1939 ఆగష్టు 20 వ తేదీ కాంగర్పాలయములో వయోజన విద్యా ప్రచారంకోసం జరపిన బహిరంగసభలో చెప్పిన ఉపన్యాసమున కనువాదం.

చదువురాని వయోధికుడు ఎప్పుడూ సిగ్గుపడుతూనే తనలోని లోపమును గుర్తించివుంటాడు. అందువలన ఉపాధ్యాయుడు అట్టి విద్యార్థిని ఎక్కువగా ఎదురు ప్రశ్నలువేసి విసిగించ కూడదు. ఎందుకంటే అతడు తప్పు సమాధానాలిచ్చి, అవి తప్పు అని తెలుసుకున్నమీదట తెలివితక్కువను చిన్నబోతాడు.

వయోధికులకు విద్య నేర్పునప్పుడు ఒకరికీ ఇద్దరికీ నేర్పడమే మంచిదిగాని పెద్ద బడిపెట్టి నేర్పడం మంచిపద్ధతి కాదు.

వయోధికులు పాఠములు నేర్చుకునేటప్పుడు తప్పినప్పుడు చాలా యిబ్బంది పడతారు. అందులో నితరులు ఎదురుగా ఉన్నప్పుడు తప్పితే మరీ యిబ్బంది పడతారు.

చదువురాని వయోధికులకు ఇదివరకే అయిదువేల పదాలు తెలిసివుంటాయి. కాని ఆ పదాలు వ్రాతలోను అచ్చులోను ఎలాగ ఉంటాయో వారికి తెలియదు. పిల్లలకు చదువుట, వ్రాయుట, తెలియడానికి ముందుగా వారికి మూడువందల మాటలు వచ్చివుంటాయి. అందుకోసమే బాలబాలికలకు ఉపయోగించే విద్యా బోధనావిధానము వయోధికులకు పనికిరాదు. పిల్లలకు మాటలదగ్గరనుంచి నేర్పుకురావాలి. పెద్దలకు అది అవసరంలేదు. వయోధికులకు వచ్చినమాటలతోనే విద్య నేర్పినట్లయితే వారు చురుకుగా విద్యావంతు లవుతారు.

వయోధికులకు మాటలు విడదీయడం పదాలు కూర్చడం మొదలైన జ్ఞానం వుంటుంది. వారికి తెలిసిన పదములను సందర్భోచితంగా ఉపయోగించ గల్గుతారు. వారికి అర్థజ్ఞానంఉంటుంది. అందువలన అర్థంలేని మాటలను పిల్లలకు నేర్పి వారికి ఆమాటలు కంఠస్థము చేయవచ్చునుగాని పెద్దవాళ్ళ విషయములో వారికిఅర్థమైనవాటినేగాని, వారికి అర్థం కాని మాటలుచెప్పి, వారినిజ్ఞాపకంఉంచుకోమంటే వారు జ్ఞాపకము ఉంచుకోలేరు.

ఇందువలన పిల్లలకు బొమ్మలద్వారా మాటలు నేర్పుకురావలెగాని పెద్దలకు ఒక విద్యా విధానము ప్రకారం విద్య నేర్పే పద్ధతి పనికివస్తుంది.

## క్రమపద్ధతి

గుణితం నేర్పడం దగ్గరనుంచీ వయోధికులకు సులభమే గనుక వారికి విద్య నేర్పుటలో ఒక క్రమపద్ధతిని అవలంబించాలి. వయోధికులకు పాఠంనేర్పేటప్పుడు పాఠంలోని విషయం పిల్లలకు చెప్పేలాంటిది కాకుండా కొంత పెద్ద విషయమై ఉండాలి. పాఠాలు ఎలాగ ఉండాలంటే ఒక దానిలో నేర్చుకున్న మాటలను వెంటనే రెండవ పాఠంలో ఉపయోగించుకునేలాగ ఉండాలి. అంతేగాని ప్రతిమాటా ఒకరు చెప్పడం, వెనకాల తను అనడం వయోధికునికి ఇష్టం ఉండదు. ఇలాగ ఒకవయోధికుడు ఒకరి దగ్గర పాఠాలు నేర్చుకుంటూఉండగా ఎప్పటికప్పుడు తాను నేర్చుకున్న విషయాలను యితరులకు నేర్పవచ్చును అన్న జ్ఞానం అతనికి మనం కలిగించాలి. ఇందువలన మనం కొందరికి విద్య నేర్పుతున్నట్లయితే యిలాగ విద్య నేర్చుకుంటున్న వయోధికులకు కూడా తాము యితరులకుకూడా పాఠాలు నేర్పగలుగుతున్నారన్న డాబుసరి కలుగుతుంది. ఇందువలన అతడు మరొకరికి నేర్పాలన్న కుతూహలముతోనే మరింత శ్రద్ధగా నేర్చుకుంటాడు.

ఈవిధంగా మనము వయోధికులకు చదువుట, వ్రాయుట నేర్పినమీదట వయోధికులకు అభిరుచి కలిగించే విషయములను గురించి వాడుకభాషలో పెద్ద అక్షరములు అచ్చుగల పుస్తకాలను సరఫరా చేయాలి. ఇలాగ వారికి అనుకూలమైన గ్రంథములను తయారుచేసి ముద్రించవలసి ఉంది."

(ఆంధ్రప్రభనుండి)

# వయోజనవిద్య – గ్రంథాలయములు

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు

మనదేశమునందు ప్రజల దుస్థితి తొలగుటకు ప్రబలమయిన యాటంకము మహాజనమునందు నూటికి తొంబదిగురకు చదువను వ్రాయను రాక వారికి విషయపరిజ్ఞానము లేకపోవుటేయని అంగీకరింపక తప్పదు..

సంపూర్ణస్వరాజ్యసంపాదనకు మనముచేసే కృషి ఫలించలేదనినా, సాధారణ పరిస్థితులలో ప్రభుత్వమువారు వ్యవసాయాదికముల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలింపలేదనినా, ప్రజాసేవకులు జనుల ఆర్థికాభివృద్ధికి చేసే కోఆపరేటివ్, ఆరోగ్యోద్యమాలు ఫలింపలేదనినా, ఇదియే ప్రథమ కారణము.

ఇందుచేతనే లోకములోని ప్రముఖరాష్ట్రాలన్నీకూడ ప్రజల అక్షరజ్ఞతను పరిపూర్ణంగా సాధించే ప్రయత్నము మొట్టమొదటి మెట్టుగా పెట్టుకున్నారు. దానితో గూడ సర్వవిషయాలను గురించి సులభమగు గ్రంథాలు రచింపించి ప్రకటిస్తూ అవి ప్రజలకందడానికి గ్రంథాలయాలు స్థాపించుకొన్నారు. పత్రికా ప్రకటన మనంతముఖముల సాగించి గ్రంథాలయాలతో పఠనాలయాలు తప్పక చేర్చుచు, పఠనాలయాలను ప్రత్యేకముగా గూడ నెలకొల్పుకొనుచున్నారు.

అక్షరజ్ఞత ఉన్నచో విషయగ్రహణానికి మానవుడింకొకరు వచ్చి చెప్పువరకు వేచియుండ నక్కరలేదు. నేడు వ్రాసి ప్రకటించే విషయాలే కాక యుగాలతరబడిని వ్రాసి ప్రకటించిన సందర్భాలన్నీ గ్రహించడం వీలవుతుంది. దినదినం క్రొత్తక్రొత్త వివరాలు అన్ని శాస్త్రాలలోను—బండ్లు నడపడం, వ్యవసాయం చేయడం, వృత్తులు జరిగించడం, పరిశ్రమలు సాధించడం, భోజనసామగ్రి గుణాలెరగడం, రోగములు కలిగించే శత్రువులను గుర్తించడం, రాజ్యాలేలుకోడం, ఒకటా? మన ఇరువదినాల్గు గంటల జీవితానికి సంబంధించిన అన్నిసంగతులకు సంబంధించిన అన్ని శాస్త్రాలలోను— ఆకాశవిమానవేగంతో—మన పెద్దలు వ్రాసిన వాయువేగ మనోవేగాలతో—సిద్ధమౌతున్నవి. ఎక్కడ? ఒక ఊళ్ళోకాదు, ఒక దేశంలోకాదు, ఒక జాతిలోగాదు. మానవుడనేవాడెక్కడెక్కడున్నాడో అక్కడక్కడంతాను— అయిదుఖండాలలోను, నూర్లకులెక్కయ్యే దేశాలలోను, రెండునూర్ల కోట్లయ్యే ప్రజాసమూహంలోను, తెల్ల నల్ల పసుపు జాతులలోను. చీనీ, ఇంగ్లీషు, రుష్యను, జర్మను, హిందీ, ఫ్రెంచి, స్పానిషు, జపానీసు, పోర్చుగీజు, ఇటాలియను, బంగాళీ, అరబిక్కు, పోలిషు, తెలుగు,

కొరియన్, మరాఠి, అరవము, టర్కీషు వగైరా నూర్లభాషలు మాట్లాడేవారిలోను ప్రచండవేగంతో నవీనభావాలు పుట్టుకొనివస్తున్నవి. ఇన్నిటినుంచీ ఎవరికి కావలసింది వారికి ఏర్చి కూర్చి బోధించే వ్యక్తులుండరు. ఉంటే అందరివద్దకు పోలేరు. పోతేనూ అందరిని కలుపలేరు. కలిపినా అందరికి అన్నీ చెప్పలేరు. కాబట్టి యీ దినం అచ్చుకూ కాగితానికి చక్షురక్షరసంయోగానికి ఎక్కడలేని విలువా కలిగింది.

ఒకదేశాన్ని మించి ఒకదేశం తన ప్రజను అక్షరజ్ఞులను చేసుకొంటుంది. నాలుగుదేశాల లెక్క చూడండి.

| | దేశము. | | విద్యావంతులు. |
|---|---|---|---|
| ౧. | ఇంగ్లండు | ౧౦౦కి | ౯౯.౬౬ |
| ౨. | అమెరికా సంయుక్తరాష్ట్రాలు | ,, | ౯౬.౧ |
| ౩. | జపాను | ,, | ౧౦౦ |
| ౪. | రుష్యా | ,, | ౯౦.౨ |

౧౯౧౫లో రుష్యాలో నూటికి ౩౦ మాత్రము విద్యాగంధము కలవారు. ౧౯౩౦నాటికి ౬౭గురు, ౧౯౩౩లో నూటికి ౯౦మంది అయినారు. అమెరికాలోని నీగ్రోలు ౧౮౬౫లో విద్యాగంధమే లేనివారు నేడు నూటికి ౮౩.౭ విద్యకలవారైనారు.

మన గతి చూడండి. ౧౮౮౧లో మనలో విద్యాగంధము కలవారు ౧౦౦కి ౩.౫గురు, ౧౯౨౧లో ౭.౬ గురు, ౧౯౩౧లో ౯.౦. అందులోను బ్రిటిషు పరగణాలకంటె కొన్ని స్వదేశ సంస్థానాలే మేలుగా ఉన్నవి. తిరువాన్కూరులో నూటికి ౨౫.౭౧, కొచ్చిన్‌లో ౨౧.౬, బరోడాలో ౧౪.౪ విద్యావంతులు కన్పింతురు. ఇదీ ఇతరదేశాలతో పోలిస్తే ఎంత తక్కువో చూడండి!

గాంధియుగంలో ఎంతో రాజకీయవికాసం కలిగిందనుకుంటున్నాము. నిర్మాణ కార్యక్రమము బాగా సాగవలెనని ప్రయత్నిస్తున్నాము. సత్యమును అహింసను స్థాపించవలెనని చూస్తున్నాము. మనదేశముద్వారా వీటినే ప్రపంచ జీవితానికి ప్రపంచ శాంతికి మూలాధారము చేయవలెనని గాంధీజీ సంకల్పం. ఇంతేకాదు. కాన్‌స్టిట్యూయెంటు అసెంబ్లీ ఏర్పరచవలెనంటున్నాము. ప్రతి వయోజనునికి వోటిచ్చి తానెట్లు ఏలబడవలెనో చెప్పే హక్కు అతనికి సంక్రమింపజేయవలయు నంటున్నాము. ఇవన్నిటిని అంధప్రాయముగా ఏవ్యక్తీ చేయరాదంటున్నాము. కాని అక్షరజ్ఞానము ప్రజకు లేకపోవడముచేత ఎవడో చెప్పినమాట వినడం మాత్రముతో సాదాప్రజ అంగీకరించి పడియుండవలసిన స్థితి ఏర్పడడముచేత కొంతదూరం మనము ప్రయాణం చేయగలిగినా మెట్టుమెట్టుకు ఎక్కువెక్కువ ఆటంకాలు కలుగడం సంభవిస్తుంది.

గాంధియంతటి ప్రజాపక్షపాతి అక్షరజ్ఞతకలవానికే వోటియ్యడం బాగని ఆ అక్షర జ్ఞతను త్వరపరచండని ప్రకటించుకోవలసివస్తూ ఉన్నది.

కాబట్టి వయోజనవిద్యకు వికాసానికి ఆధారభూతమయిన అక్షరజ్ఞత కల్పించడము నేడందరు దేశాభిమానుల ప్రథమ కర్తవ్యమయిపోయినది

కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారములో నున్నప్పుడు మనకోస్తాలో ఈ ప్రయత్నం అంత ఎక్కువగా జరుగలేదు. ఇతరకోస్తాలలో జరిగిన తీక్ష్ణకృషినిగురించి ఈ పత్రిక మొదటి సంచికలో వ్రాసినారు. మన మంత్రివర్గంవారి మాట ఎట్లున్నా మన ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమువారు ఈ కర్తవ్యాన్ని గుర్తించక పోలేదు. ౧౯౩౬ డిసెంబరులోనే గ్రంథాలయ సర్వస్వములో **'నిరక్షరాస్య నిర్మూలనము—ఐదు సంవత్సరాల కార్యక్రమము'** అని నేనే వ్రాసి స్వయముగా కొన్ని గ్రంథాలయాలకు వెళ్ళి ప్రచారము కూడ కావించితిని. కాని మన సంస్థలకు ద్రవ్యములేక పనిచేయువారలకు ప్రోత్సాహము లేక గవర్నమెంటువారు ఇదివరలో ఇచ్చుచుండిన గ్రాంటులు కూడ అదృశ్యము కావడముచేత పనికుంటు పడినది.

ఎన్నికష్టములున్నను ఇది నిద్రించుటకు సమయముమాత్రము కాదు. సర్కారువారు సహాయము చేతురా సంతోషము. చేయకున్నను మనము నిస్పృహచెందరాదు. ఆంధ్రోద్యమచరిత్రలో భాగముగా మద్రాసుజిల్లా ఆంధ్ర కాంగ్రెసు సంఘమువారు చెన్నపురినగరములో ఈ ఉద్యమాన్ని సాగించే సూచనలు కన్పించుచున్నవి. నిజానికీయుద్యమము ప్రధానంగా సాగించవలసిన నిర్మాణ కార్యక్రమము. సర్వజీవితాశయాల సాధనకూ ఇది యావశ్యకమని నమ్మేవారము గ్రంథాలయోద్యోగపరులైన మనము. కాబట్టి గ్రంథాలయసేవకు లందరును ఎక్కడివా రక్కడ ఏ ప్రజాహిత సంస్థనో ప్రోత్సాహపరచి ఈయుద్యమాన్ని ఉపక్రమించి కొనసాగించుటకు కంకణము కట్టుకొందురుగాక యని కోరుచున్నాను.

---

# వయోజన విద్యాప్రచారోద్యమ సమాచారములు

## శేలంజిల్లాలో నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమం

కృష్ణగిరిలో 1940 జనవరి నెలలో గ్రామోద్ధరణ కార్యమందు శిక్షణనొసగుటకు, నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమమును సాగించుటకును ప్రయత్నములు జరుగుతున్నాయి.

## రాత్రి పాఠశాలవార్షికోత్సవం, ఆత్రేయపురం

1939 డిశంబరు 30 తేదీరాత్రి తూర్పుగోదావరిజిల్లా, ఆత్రేయపురం గ్రామయువజనసంఘమువారి రాత్రి పాఠశాలవార్షికోత్సవము ఈ రేంజీ డిప్యూటీఇన్‌స్పెక్టరువారి అధిపత్యమున జరుపబడెను

1938 సెప్టెంబరు 1వ తేదీని 6 గురితో స్థాపింపబడిన ఆరాత్రి పాఠశాల ఎట్లు క్రమాభివృద్ధి నొందినది వివరించుచు, పగలు బడిలోనికిపోవుట కవకాశములేని పిల్లలకొఱకును, ప్రాథమికవిద్య పూర్తిచేసికొని చదువుకొను సౌకర్యములేక చదివినదానిని మఱచిపోవుచున్నవారికొఱకును, చదువురాని వయోజనులకు విజ్ఞానము నందించుకొఱకును పాఠశాల పనిచేయుచున్నదని యువజనసంఘ కార్యదర్శిగారు నుడివిరి. పిమ్మట సుప్రసిద్ధగ్రంథాలయసేవకులును, వయోజనవిద్యాప్రచారకులును అగు శ్రీపుణ్యమూర్తుల రాజశేఖరం బి. ఏ., బి. ఇడి గారుపన్యసించుచు విద్యాప్రయోజనములగూర్చియు, డెన్మార్కుదేశమందు జరుగుచున్న విద్యాప్రచారమును, ఆదేశములో వ్యవసాయకులు దానివలన పొందుచున్నలాభములను, భారతదేశమందు వేర్వేరురాష్ట్రములందు జరుగుచున్న వయోజనవిద్యాప్రచారమునుగూర్చియు వివరించి, గ్రామస్థులందరును ఈరాత్రి పాఠశాల నన్నివిధముల ప్రోత్సహింపవలసినదని హెచ్చరించుచు గంభీరోపన్యాసము గావించిరి. తరువాత డాక్టరు గరిమెళ్ళ వెంకట్రావుగారు యువజనసంఘమువారు చేయుచున్న ఈస్వార్థరహితసేవకు ప్రజలు కృతజ్ఞులై పిల్లలను పంపియు, ధనసహాయముజేసియు తోడ్పడవలెనని చక్కనిఉపన్యాసమును ఇచ్చిరి. తదుపరి అధ్యక్షులు ప్రజలందరు విద్యావిషయములో శ్రద్ధవహించి అవకాశమున్నవారు పగలు బడికిని, లేనివారు రాత్రిబడికిని పోయి చదువుకొని విద్యావంతులు కావలెనని హెచ్చరించిరి. కార్యదర్శి కృతజ్ఞతావందనములతో వార్షికోత్సవము సమాప్తి అయినది.

## గ్రామసౌభాగ్యగోష్ఠివారి రాత్రిపాఠశాల, వాడపల్లి (తూర్పుగోదావరి)

పగలు పాఠశాలకుబోయి విద్య నభ్యసించుటకు అవకాశములేని కార్మికులయొక్కయు, కర్షకులయొక్కయు బిడ్డలకొరకు వాడపల్లి గ్రామసౌభాగ్యగోష్ఠివారి యాజమాన్యమున రాత్రిపాఠశాల నెలకొల్పబడినది. 30 మంది పిల్లలు విద్యనభ్యసించుచున్నారు. గోష్ఠియాజమాన్యముననే గ్రామస్థులకు వైద్యసహాయంనిమిత్తం నెలకొల్పబడిన హోమియోరూరల్ డిస్పెన్సరీని నడుపుచున్న శ్రీ పోచిరాజు సూర్యప్రకాశంగారు, సుప్రసిద్ధ కాంగ్రెసుసేవకులగు శ్రీ తెలిదేవర రాజుగారు రాత్రిపాఠశాలయందు పనిచేయుచున్నారు. ఈరెండుసంస్థలను నెలకొల్పుటకు కారకులగు శ్రీపుణ్యమూర్తుల తమ్మిరాజుగారికి మాధన్యవాదములు.

## ఒరిస్సా: అఖిలఉత్కళ అనక్షరదినం

1939 అక్టోబరు 5వ తేదీని సకల ఒరిస్సా అక్షరాస్య దినోత్సవసందర్భములో షుమారు 2000 మంది విద్యార్థులు, ఉపాధ్యాయులు, "అనక్షరత్వము రూపుమాపి అజ్ఞానాన్ని వెడలగొట్టండి" అను హెచ్చరికలుగల అట్టలతో ఉదయం 7 గంటలు మొదలు 10 గంటలవరకు బరంపురంపట్టణ మంతా ఊరేగారు.

ఈసందర్భంలో రావుబహదూర్ ఎమ్. వి. అప్పారావుపంతులుగారు ఆగావీధి స్కూలులో జరిగినసభకు అధ్యక్షతవహించి చదువురానివారి కక్షరజ్ఞాన మలవరచువిషయంలో చదువుకొన్నవారం దరు శ్రద్ధవహించి ఎవరింట్లోవారు చదువురానివారుండకుండునట్లు చూచుటే కాక యిరుగుపొరుగు వారలందరకుగూడ చదువువచ్చునట్లు చేయవలయునని దీక్ష వహించవలసినదిగా ప్రబోధించిరి. శ్రీ జి. నారాయణగారు నిరక్షరాస్యతవలన జాతీయాభివృద్ధికి కల్గునష్టములు వివరించిరి. శ్రీ జి. సత్య నారాయణగారు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారిచే నిరక్షరాస్యతానిర్మూలనమును గూర్చి రచింపబడిన పద్యములనుచదివిరి.

శ్రీ ఆంధ్రభాషాభివర్ధనీ సమాజములో నొకసభజరిగెను. నిరక్షరులను అక్షరజ్ఞానులనుగా చేయుటకు బద్ధకంకణులు కావలయుననియు, అట్లు దీక్షపట్టినచేగాని యీసమస్య చక్కబడ నేరదనియు చెప్పబడెను. దేశములో నిరక్షరాస్యతను నిర్మూలించువిషయమున విద్యావంతుల కర్తవ్యమును గురించి శ్రీ వరహాగిరి జోగయ్యపంతులు, శ్రీ వీరరాఘవస్వామిగార్లు హెచ్చరించిరి.

కటకంలోని విద్యార్థులు ఉదయం జట్లుజట్లుగా గ్రామాలకు వెళ్లారు. మధ్యాహ్నం సెక్రటేరియటువద్ద చేరి, అక్కడనుండి ఒక మైలుపొడుగు ఊరేగింపు సాగించారు. విద్యామంత్రి బోధారాండు బేగారు, డి. పి. ఐ. త్రిపాఠీగారు, ఇతర ఉద్యోగ అనుద్యోగ ప్రముఖులు ఊరేగింపులో అగ్రస్థానం వహించారు. అనేకమంది విద్యార్థినులుకూడ చేరారు. టౌనుహాలువద్ద ఊరేగింపుముగిసి సభజరిగింది. పలువురుప్రముఖులు నిరక్షరాస్యతా నిర్మూలనమును గూర్చి ఉపన్యసించారు. అధ్యక్షత వహించిన బోధారాండుబేగారు ప్రజలసహకార మవసరమని హెచ్చరించారు. కోరాపుట్టి గంజాం ఏజెన్సీలలోను, ఇతర మినహాయింపుప్రదేశాలలోను అక్షరాస్యతాప్రచారం చాల అవసరమని చెప్పారు.

## వంగదేశం

గత అక్టోబరునందు, గ్రామములలో వయోజనులకు విద్యగరపుటకు వెళ్ళుచున్న వందమంది బెంగాలీయువకుల నుద్బోధించుచు విద్యవలనిలాభములను అమృతబజారు పత్రికాసంపాదకుడగు శ్రీ తుషారకాంతిఘోషుగారు వివరించిరి. ఈసభ కలకత్తా యూనివర్సిటీ ఇన్‌స్టిట్యూట్ అడల్టు ఎడ్యుకేషనుకమిటీవారిచే నేర్పాటుచేయబడెను. విద్యవలన ప్రజలు అభివృద్ధిచెందుదురనియు, మత విభేదములు తొలగుననియు తుషారకాంతిఘోషుగారు చెప్పారు. పెద్దవారికి విద్యనొసగుసమస్య చాలముఖ్యమైనదనియు, భారతదేశంలో కోటానుకోట్లుగా ప్రజలు నిరక్షరాస్యులుగా నున్నారనియు, వీరికి విద్యాదానముచేసినగాని ప్రజాభివృద్ధికై రాష్ట్రీయప్రభుత్వములవారు గైకొనుచున్న చర్యలు ఫలప్రదముకావనియు, ప్రస్తుతసమయమున అత్యంత ప్రాముఖ్యమువహించిన వయోజనవిద్యాసమస్య నాయకులు పరిష్కరింపవలసి యున్నదనియు ఘోషుగారుద్బోధించిరి.

## అస్సాం

కాంగ్రెసు శోయలిమనుపార్టీ ఉపసంఘంవారు గ్రామపునరుద్ధరణశాఖ నొకదానిని ప్రభుత్వ కార్యాలయమునందు ప్రత్యేకంగా ఏర్పాటుచేయవలెనని క్రొత్తసూచనలను దాఖలుచేసిరి. ప్రతి సబ్ డివిజనులోను ఒక గ్రామ పునరుద్ధరణకేంద్రము స్థాపించి అక్షరాస్యతాప్రచారం, ఆరోగ్యసహాయం మున్నగు కార్యములు చేయించుటకు ఒకస్కీము దాఖలుచేసిరి. దానిని ప్రభుత్వంవారు 1940 నుండి అమలుజరిపెదరు.

## సంయుక్తరాష్ట్రములు

ఈరాష్ట్రంలో ప్రారంభింపబడిన అక్షరాస్యతాప్రచారమును సాగించుటనుగురించి విద్యాధికులు శ్రద్ధవహిస్తున్నారు. ఈఉద్యమము ఎన్. ఎన్. చతుర్వేదిగారు ప్రత్యేకోద్యోగిగా, 7 లక్షల రూపాయల గ్రాంటుతో ప్రారంభింపబడినది.

## పంజాబు: అద్భుతమైన అభివృద్ధి

పంజాబు విద్యామంత్రిగారగు మియాన్ అబ్దుల్ హైగారు గత ఆగష్టు 12వ తేదీని ఉదయమున ముల్తానుకుబోయి, నిరక్షరాస్యతానిర్మూలనమునుగూర్చి ఒక గొప్పబహిరంగసభలో ఉపన్యసించారు. సాయంత్రం, అక్కడికి 16 మైళ్ళ దూరముననున్న మీర్దుంరషీదు గ్రామానికివెళ్ళి వయోజనులలో నిరక్షరాస్యత లేకుండ జేయవలెనని అక్కడిజమీందారులను ప్రబోధించారు.

ఆగష్టు 13-వ తేదీని ముల్తాను సెంట్రలుజైళ్ళను సందర్శించారు. పాతజైలులో 320 మంది ఖయిదీలకు 56 గురు వార్డరులకు 1 ఉపాధ్యాయుడు 10 మందిఖైదీలు బోధించి వారిని అక్షరాస్యులనుచేసిరని మంత్రిగారితో సూపరింటెండెంటు తెలిపెను. క్రొత్త సెంట్రలుజైలులో 468 మంది ఖయిదీలు, 46 గురు వార్డరులూ, ఒక ఉపాధ్యాయుడు 14 గురు ఖయిదీలచే మూడునెలలలో అక్షరాస్యులుగ చేయబడిరని మంత్రిగారితో సూపరింటెండెంటు తెలిపెను.

# గ్రంథాలయములు—రిజిస్ట్రేషను

గ్రంథాలయమనునది ఒక సంఘవ్యవస్థ. ఇది క్రమముగ నడుపవలెనన్న కొన్ని కట్టుబాట్లవసరము. నేడు పాశ్చాత్యదేశములలో చాలభాగమిది ప్రత్యేక చట్టములద్వారా పరిపాలింపబడుచున్నది. దీని నిర్వహణమునకు సంబంధించిన విషయముల నన్నిటిని అచ్చటి చట్టములే నియమించుచున్నవి. భారత దేశమున నిట్టి చట్టములు లేకున్నను ఇండియా గవర్నమెంటువారి 1860 వ సం॥ 21 వ సొసైటీల ఆక్టు ననుసరించి గ్రంథాలయములను రిజిస్టరు చేసికొనవచ్చును. రు 50-0-0 ల రుసుముతో, 7గురకు తక్కువగాని స్త్రీ పురుషులు చేరి, కొన్ని ఏర్పాటులపై గ్రంథాలయము నొకదానిని రిజిస్టరు చేసికొనుట కీచట్టము అవకాశ మిచ్చుచున్నది. ప్రభుత్వమునుండియు స్థానిక సంస్థలనుండియు ఎట్టిసాయమునుగాని పొందుటకును, ఇతరవిధములగు స్థిర వసతుల సంపాదించుటకును గ్రంథాలయములు పై చట్టము ననుసరించి రిజిస్టరు చేయబడుటవసర మగుచున్నది.

దిగువ నుదహరించిన పద్ధతిని నిబంధనల తయారుచేసి, సంకల్పపత్రమును నియమావళిని వేరు వేరుగ వ్రాసి, వీనిని రిజిస్టరుచేయబడు గ్రంథాలయముయొక్క పాలకవర్గ సభ్యులలో నేయొక్కరుగాని ఆగ్రంథాలయమున్న జిల్లాకు సంబంధించిన జాయింట్ స్టాక్ కంపెనీల రిజిస్ట్రారుగారికి, రిజిస్ట్రేషను రుసుముతో సహా దాఖలు చేసికొనవలెను. అందుపై వారు పై పత్రములకు రశీదులను, గ్రంథాలయము రిజిస్టరు చేయబడినట్లు తమ ఆఫీసుముద్రగల ధృవపత్రముల (certificates) ను నిత్తురు.

నియమావళిని వ్రాసికొనుటలో క్రింది విషయములు ముఖ్యముగ గమనింపబడవలెను.

1. కార్యస్థాన నిరూపణము (స్థలనిర్ణయము)

2. గ్రంథాలయ నివేదిక సంవత్సర నిర్ణయము (గ్రంథాలయము లెక్క లెప్పటినుండి ప్రారంభమగునది)

3. వార్షికముగ తప్పక జరుపవలసిన సామాన్య సంఘసమావేశకాలము (ఏమాసమందైనదీ స్పష్టపరుపవలెను)

4. గ్రంథాలయోద్యోగుల వేర్వేరు విధులు, గ్రంథాలయమునకు సంబంధించిన పత్రములు, కోర్టు వ్యవహారములు (దావాలు) వగైరా ఎవరిపేర జరుగవలసినది.

క్రిందినిబంధన రిజిస్టరుకాని గ్రంథాలయములకు సహిత ముపయోగించును. స్థానికావసరములను బట్టి దీనిలో మార్పులు చేసికొనవచ్చును. దీనికి సంబంధించిన విశేషవివరములు తెలియ గోరువారు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యస్థానమునకు వ్రాసిన బడయగలరు.

## గ్రంథాలయములు రిజిస్టరు చేయుటకైన మాదిరి నిబంధన

# Memorandum of Association

## (సంకల్పపత్రము)

౧. సంఘము పేరు :

౨. ఉద్దేశములు :

(అ) ధర్మపుస్తక భాండాగారమును, పఠనమందిరమును నిర్వహించుట.

(ఆ) మ్యాజికు లాంతరు, రేడియో మున్నగు సాధనములద్వారా జనసామాన్యమునందు విజ్ఞానవ్యాప్తిని గలిగించుట.

(ఇ) వయోజన విద్యాలయములు, ఉపన్యాసములు, పాఠకసంఘములు, వాగ్వర్ధనీ సమాజములు, పోటీ పరీక్షలు ఏర్పాటుచేయుట.

(ఈ) మహాపురుషుల జయంతులు, వర్ధంతులు, జాతీయపండుగలు జరపుట.

(ఉ) మానవసంఘాభివృద్ధి కవసరమైన సమస్త జీవితశాఖలలోను కృషిసల్పుట.

(ఊ) సంఘోద్దేశముల నాచరణలోనికి తెచ్చుట కవసరమైన ఆస్తిని సంపాదించుటకై తగిన సాధనముల నన్నిటి నవలంబించుట.

(ఋ) ఇప్పటికి సంఘమునకు చెందియున్న ఆస్తికి, ముందు సంపాదించబోవుదానికి హక్కు-బాధ్యతలు గలిగి వ్యవహరించుచు, దానిని సంఘ కార్యములకై వినియోగించుట.

౩. ప్రస్తుత పాలకవర్గ సభ్యుల జాబితా :

| | పేరు | హోదా | వృత్తి | చిరునామా |
|---|---|---|---|---|
| 1. | | | | |
| — | | | | |

ఈ దిగువ సంతకములుచేసిన మేము 1860వ సం॥ 21వ ఆక్టుక్రింద పై సంకల్పపత్రము ననుసరించి ఒక సంఘముగ నేర్పడినారము.

| | సభ్యుల సంతకము | వృత్తి | చిరునామా |
|---|---|---|---|
| 1. | | | |
| — | | | |
| 7. | | | |

పై సంతకములు చేసినవారికి సాక్షులు.

| | | సంతకము | వృత్తి | చిరునామా |
|---|---|---|---|---|
| తేదీ : | } | 1. | | |
| మకాము : | } | 2. | | |

# (Rules and Regulations)

............................................................................*

## నియమావళి

౧. ఈ సంఘ కార్యస్థానము                    లో నుండును.

౨. ఈ సంఘ కార్యక్రమమును క్రింది సంఘములు నిర్వహించును.

అ. సామాన్యసంఘము      ఆ. పాలకవర్గము[1]

3. ఈ క్రిందివారు సామాన్య సంఘసభ్యులుగ నుందురు.

అ. శాశ్వతసభ్యులు : ఈ సంఘమున కొకేపర్యాయము

(౧) రు ౨౫౦–౦–౦ లు గాని, అంతకు పైబడు మొత్తమునుగాని ఇచ్చువారు ప్రధాన పోషకులు.

(౨) రు ౧౦౦–౦–౦ లు గాని, అంతకు పైబడు మొత్తమునుగాని ఇచ్చువారు పోషకులు.

(3) రు ౫౦–౦–౦లకు తక్కువగాని మొత్తము నిచ్చువారు సహాయులు.

(౪) రు ౨౫–౦–౦ లకు తక్కువగాని మొత్తము నిచ్చువారు శాశ్వత సభ్యులు.

ఆ. సాధారణసభ్యులు : ఈ సంఘమునకు సంవత్సరమునకు

(౧) రు ౧౨–౦–౦ లకు తక్కువగాని చందానిచ్చెడివారు మొదటితరగతి సభ్యులు.

(౨) రు ౬–౦–౦ లకు తక్కువగాని చందా నిచ్చెడివారు రెండవతరగతి సభ్యులు.

(3) రు 3–౦–౦ లకు తక్కువగాని చందా నిచ్చెడివారు మూడవతరగతి సభ్యులు.

(౪) రు ౧–౦–౦ కు తక్కువగాని చందానిచ్చెడివారు నాల్గవతరగతి సభ్యులు.

౪. (అ) పాలకవర్గము సామాన్యసంఘముచే సంవత్సరమున కొకపర్యాయము ఏప్రిల్ మాసములో[2] ఎన్నుకొనబడవలెను.

(ఆ) పాలకవర్గమునకు ౧ అధ్యక్షుడు, ౧ కార్యదర్శి, ౧ కోశాధిపతి, మరి ౬ గురు సభ్యులు నుందురు.[3]

---

* ఈ స్థానములో సంఘము పేరు వ్రాయవలెను.

1. 'పాలకవర్గము'నకు బదులు 'కార్యనిర్వాహకసంఘము' అనియు వ్రాసికొనవచ్చును. అయితే దీనికి అన్నిచోట్ల ఒకే పదము వాడవలెను.

2. సామాన్య సంఘము పాలకవర్గము నెన్నుకొనుటకై కూడవలసిన మాసము సంఘముయొక్క లెక్కలు ప్రారంభమగు కాలముపై నాధారపడి యుండును.

3. పాలకవర్గ సభ్యులలో అవసరమైన యెడల ఒక ఉపాధ్యక్షుని, సహాయకార్యదర్శి లేక సంయుక్తకార్యదర్శి నొకరిని చేర్చుకొనవచ్చును. ఇట్లు చేర్చుకొనబడిన ఉద్యోగుల విధు

## సభ్యులు

౫. (అ) ౧౮ సంవత్సరములకు పైబడిన స్త్రీగాని, పురుషుడుగాని ఈ సంఘమున సభ్యులుగ చేరవచ్చును.

(ఆ) పాలకవర్గమువారి అంగీకారమును బడసి చందా చెల్లించినవారు మాత్రమే సభ్యత్వార్హతను కలిగియుందురు.

(ఇ) వరుసగ ఒక సంవత్సరమునకు పైగ చందాను చెల్లించనివారు తమ సభ్యత్వమును కోల్పోవుదురు.

(ఈ) సంఘక్షేమమునకు వ్యతిరేకముగ నడచు సభ్యులు సామాన్యసంఘమువారి తీర్మానముప్రకారము సభ్యత్వమునుండి తొలగింపబడవచ్చును.

## సమావేశములు

౬. (అ) ఈ సంఘముయొక్క సామాన్య సంఘ సమావేశము సంవత్సరమున కొక పర్యాయము విధిగ ఏప్రిల్ మాసములో కూడుచుండవలెను.

(ఆ) పాలకవర్గము సంవత్సరమునకు కనీసము ౪ పర్యాయములైనను కూడుచుండవలెను.

(ఇ) సామాన్య సంఘ సభ్యులకు ౭ దినములు ముందుగను, పాలకవర్గ సభ్యులకు 3 దినములు ముందుగను, ఆయా సమావేశముల ప్రకటన లందజేయబడవలెను.

(ఈ) సామాన్య సంఘ సభలకు ౧౨ మంది సభ్యులును, పాలకవర్గసభలకు ౫ మందియు కనీసము హాజరు కావలెను.

(ఉ) వరుసగ పై రెండుసంఘముల సమావేశములకును రెండుపర్యాయములు నిర్ణీతసభ్యులు హాజరు కానియెడల, మూడవ పర్యాయము హాజరైన సభ్యులతోనే సభా కార్యక్రమమును సాగించవచ్చును.

(ఊ) సాధారణముగ నీ సంఘ సమావేశములను కార్యదర్శియే కూర్చుచుండును. కాని పాలకవర్గసభ్యులు ౫ గురు కాని, సామాన్యసంఘసభ్యులు ౧౨ మంది కాని కోరినప్పుడు కార్యదర్శి, లేనిచో అధ్యక్షుడు విధిగా ఆయా సంఘములను సమావేశపరచవలెను. వారట్లు చేయనిపక్షమున పై సభ్యులే సమావేశప్రకటనల సభ్యుల కందజేసి సదరు సమావేశములను జరుపవచ్చును.

---

లను వరుసగ అధ్యక్ష కార్యదర్శుల విధులకు పిమ్మట వేరుగ వ్రాసికొనవలెను. సభ్యుల సంఖ్యను కూడ అవసరమున్న పెంచుకొనవచ్చును. అట్లే స్థానిక పరిస్థితుల ననుసరించి అనవసరముగ తోచు ఉద్యోగములను తగ్గించుకొని అట్లు తగ్గింపబడినవారు నెరవేర్చవలసిన విధులను ఉన్న ఉద్యోగులపై పంచుట మంచిది. ఎట్టి పరిస్థితులలోగాని అధ్యక్ష కార్యదర్శులుమాత్రము ప్రతి సంఘమున నుండకతప్పదు

సామాన్య సంఘము విధులు

౭. సంవత్సరమున కొక పర్యాయము పాలకవర్గము నెన్నుకొనుట; గడచిన సంవత్సర కార్యనివేదికను, ఆదాయ వ్యయములను పరిశీలించి అంగీకరించుట; ముందు సంవత్సరమునకు బడ్జెటు అంచనా నంగీకరించుట సామాన్యసంఘము విధులు. సంఘమునకు సంబంధించిన సమస్తవిషయము లందును సామాన్య సంఘమువారి తీర్మానమే అంత్య పరిష్కారముగ నుండును.

పాలకవర్గము విధులు

౮. (అ) సామాన్య సంఘమువారి తీర్మానమునకు లోబడి సంఘముయొక్క కార్యక్రమమును నడపుట, ఇందు కవసరమైన ఉపసంఘముల నియమించుట; సంఘమునకు సంబంధించిన ఆస్తి వగైరాలను బాధ్యతతో పాలించుట; సంఘముయొక్క సంవత్సర నివేదికలను, సాలుసరి జమాఖర్చు లెక్కలను, రాబోవు సంవత్సర ఆదాయ వ్యయ మదింపులను తయారు చేసి సామాన్య సంఘము వారి యెదుట నుంచుట; గ్రంథభాండాగారిని, గ్రంథాలయ కార్యక్రమమును నడపుట కవసరమైన ఇతర సిబ్బందిని ఏర్పాటుచేసి వారి తోడ్పాటుతో గ్రంథాలయమును నడపుట పాలకవర్గమువారి విధులు.

(ఆ) వరుసగ మూడు సమావేశములకు హాజరుకాని పాలకవర్గ సభ్యులు తమ సభ్యత్వమును కోల్పోవుదురు. కాని తిరిగి వారే తమపదవులకు ఎన్నుకొనబడవచ్చును.

(ఇ) పాలకవర్గములో పైకారణమువల్లగాని, రాజీనామా మొదలగు ఇతర కారణములవల్లగాని సంవత్సరముమధ్య యేర్పడు ఖాళీలను పాలకవర్గమువారే భర్తీ చేసికొందురు.

అధ్యక్షుండు

౯. సంఘసమావేశముల కన్నిటికిని అధ్యక్షత వహించుట, సంఘ కార్యక్రమము సక్రమముగ జరుగునట్లు చూచుట, కార్యదర్శి లేనిసమయమునగాని, సభ్యులు కోరినప్పుడుగాని సంఘ సమావేశములను జరుపుట, సంఘముయొక్క ఆస్తులకు దస్తావేజులు, ప్రామిసరీనోట్లు వగైరా పత్రములు వ్రాయించుకొనుట, వ్రాయుట అధ్యక్షునివిధులు.

కార్యదర్శి

౧౦. సంఘ సమావేశముల జరిపి వాని కార్యక్రమముల వ్రాయుట, చందాలు, విరాళములు వగైరా వసూలుచేసి కోశాధిపతి కప్పగించుట, సంఘముయొక్క లెక్కలను తగిన నిదర్శనములతోసహా వ్రాయుట, సంఘమునకు సంబంధించిన దావాలు వగైరా కోర్టువ్యవహారములను నడపుట, పైని వివరింపబడిన సంఘము రికార్డు నంతటిని తన యధీనమున నుంచుకొని రక్షించుట కార్యదర్శి విధులు.

కోశాధిపతి

౧౧. సంఘముయొక్క ఆస్తిని తన యధీనమున నుంచుకొని పాలకవర్గమువారి తీర్మానానుసారము దానిని పాలించుట, తీర్మానమును చూపి కోరినప్పుడును, అడ్వాన్సుగను అవసరమైన పైకమును కార్యదర్శికిచ్చుట కోశాధిపతి విధులు.

గ్రంథభాండాగారి *

౧౨. పుస్తకభాండాగారమును, పఠనమందిరమును స్వాధీనమందుంచుకొని చదువరులకు వలయు పత్రికలు, పుస్తకములు ఇచ్చుచు తిరిగి తీసికొనుట; చదువరులు నష్టపరచిన పుస్తకములు, పత్రికలు మొదలగువాని విషయమై పాలకవర్గము వారికి రిపోర్టుచేయుట; గ్రంథాలయ నిత్య నిర్వహణకు తోడ్పడుటకై అవసరమైన నిబంధనల తయారుచేయుటలో పాలకవర్గమువారికి తోడ్పడుట మున్నగు కార్యక్రమమును గ్రంథ భాండాగారి సాగించుచుండవలెను.

లెక్కలు — తనిఖీ

౧౩. (అ) ప్రతిసంవత్సరము ఈ సంఘముయొక్క లెక్కలు తెలుగు సంవత్సరాదితో ప్రారంభమగును.

(ఆ) పాలకవర్గమువారిచే నియమింపబడువారిచే యేటేట దీని లెక్కలు తనిఖీ చేయబడవలెను.

వివిధ నియమములు

౧౪. ఈ సంఘ నియమముల సవరించుటకును, క్రొత్తవానిని చేర్చుటకును సామాన్య సంఘమున కధికారము గలదు. కాని ఇందునిమిత్తమై సామాన్యసంఘము యొక్క ప్రత్యేక సమావేశము జరుపబడి దీనికి హాజరగు సభ్యుల మొత్తములో మూడింట రెండువంతులమంది అంగీకరించిననే అట్లుచేయ వీలగును.

పై నియమములు "......................"** యొక్క నియమావళికి సరియైన నకలని ధృవపరచుచున్నాము.

| పాలకవర్గసభ్యుల సంతకము. | హోదా. | వృత్తి. | చిరునామా. |
|---|---|---|---|
| 1. | | | |
| 2. | | | |
| 3. | | | |

పై సంతకములు చేసినవారికి సాక్షులు.

| | సంతకము. | వృత్తి | చిరునామా. |
|---|---|---|---|
| తేదీ : | 1. | | |
| మకాము : | 2. | | |

* గ్రంథభాండాగారి గ్రంథాలయము యొక్క దైనందిన కార్యక్రమమును నిర్వహించు ఉద్యోగి. ఇతడు పాలకవర్గమున చేర్చబడలేదు. అయినను గ్రంథపాలనా కార్యక్రమమున నీతనికి సంపూర్ణ స్వాతంత్ర్యముండును. ఈవిషయమై యెప్పటికప్పుడు ఇతనిసలహాల ననుసరించియే పాలకవర్గమువారు నిబంధనల చేయవలసి యుండును.

** "......................"ఈ ఖాళీలో సంఘము పేరు వ్రాయవలెను.

# సమాచారాలు - సలహాలు

## ఆంధ్ర గ్రంథాలయోద్యమము

### ఆం. దే. గ్రం. సంఘ సమావేశములు

19—10—39 వ తేదీ గురువారం ఉదయం 8½ గంటలకు ఆం. దే. గ్రం. సంఘ పాలక వర్గము గుంటూరుజిల్లా వేటపాలెం 'సుబ్రాయమహల్'లో సమావేశమై చేసిన తీర్మానములు.

హాజరు : శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ పూటుకూరు జయరామదాసు,
శ్రీ నాగినేని వెంకయ్య.

తీర్మానములు :

౧. ఈ సమావేశమునకు అధ్యక్ష, ఉపాధ్యక్షులలో నెవరుగాని హాజరుకానందున శ్రీ నాగినేని వెంకయ్యగారిని అధ్యక్షులుగ నెన్నుకొనుటయైనది.

౨. (అ) స్థానికసంస్థలు, మునిసిపాలిటీల డిప్యూటీ ఇనస్పెక్టరుయొక్క వ్రాతమూలకమైన అనుమతి ముందుగ బడయనిదే ఏ పంచాయతీబోర్డుగాని గ్రంథాలయముల స్థాపన, నిర్వహణములకును పత్రికలు తెప్పించుటకును బోర్డుసొమ్మును వ్యయముచేయకూడదని మదరాసు ప్రభుత్వము వారు ప్రకటించిన చిత్తు నిబంధనకు (జీ. ఓ. నెం. 1888 విద్య, 18 ఆగష్టు 1939)— ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గము చాల విచారపడుచు వయోజనవిద్యావ్యాప్తిని, ప్రజాతంత్రసంస్థల హక్కులను పై నిబంధన బుద్ధిపూర్వకముగ నిరోధించుననియు, అందును ముఖ్యముగ వయోజనవిద్యా ప్రణాళికను, స్వతంత్ర పంచాయతీ విధానమును అమలు జరుపవలెనని తలచుచున్న ప్రస్తుత ప్రభుత్వ పరిపాలనలో ఇట్టి ముసాయిదా జీ. వో. ను వెంటనే నిలుపుదల చేయవలెనని మద్రాసు ప్రభుత్వమువారి నీసంఘమువారు కోరుచున్నారు.

(ఆ) ఇట్టి తీర్మానమును ఆంధ్రదేశములోని జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయతీబోర్డులు, గ్రంథాలయములు, గ్రంథాలయప్రచారకసంఘములు మున్నగు ప్రజాసంస్థలన్నియు ప్రభుత్వమునకు నవంబరు మొదటివారములోపున పంపుచు పై నిబంధనకు తమ తమ అసమ్మతుల తెలియపరచవలసినదిగ ఈ సంఘమువారు కోరుచున్నారు.

3. శాఖాసంఘములకును కేంద్రసంఘమునకును మధ్య నుండదగు సంబంధమును, వివిధసంఘముల విధులను గూర్చియు కార్యదర్శి తయారుచేసిన నివేదిక చదవబడమైనది. ఈ నివేదికను శాఖాసంఘములకు అందజేసి వచ్చే సర్వసభ్యసమావేశమందు ప్రవేశపెట్టుటకు అంగీకరించడమైనది.

౪. ప్రకటనలోని 3, 4 అంశములు వచ్చే సమావేశములో ప్రవేశపెట్టుటకు తీర్మానించడమైనది.

౫. సంఘముయొక్క పాలకవర్గ సమావేశములను ఏటేట సాధ్యమైనంతవరకు అన్నిజిల్లాలలోను జరుపు టవసరమని చేయబడిన సూచన నామోదించడమైనది.

౬. మద్రాసురాష్ట్ర ప్రభుత్వముయొక్క 9—5—39 వ తేదీ విద్యా, ప్రజారోగ్యశాఖవారి 51433/38 A-3 మెమోరాండము ననుసరించి ఆంధ్రదేశములోని లోకల్ బోర్డులు, మునిసిపాలిటీలు సంఘసభ్యులుగ చేరుటకును; కార్యాలయభవన నిర్మాణమునకు విరివిగ విరాళముల నొసంగుటకును కోరడమైనది.

వేటపాలెం,
19—10—39.

(సం.) నాగినేని వెంకయ్య
సభాధ్యక్షుడు

9—1—40 వ తేదీ రాత్రి 10½ గంటలకు ఏలూరు పురమందిరపు టావరణములో ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గము సమావేశమై క్రింది తీర్మానముల గావించెను.

హాజరు : శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ వుప్పులూరి వెంకటకృష్ణయ్య,
,, తేతలి సత్యనారాయణమూర్తి, ,, ఈదుపుగంటి వేంకటరత్నమాంబ,
,, మల్లెల శ్రీరామమూర్తి, ,, తాడిమేటి కుటుంబశాస్త్రి.

**తీర్మానములు :**

౧. ఈ సభకు అధ్యక్ష, ఉపాధ్యక్షులలో నెవ్వరుగాని హాజరుకానందున శ్రీ ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారిని అధ్యక్షులుగ నెన్నుకొనడమయినది.

౨. 1—5—39 వ తేదీనుండి 8—1—40 వ తేదీవరకు సంఘముయొక్క లెక్కలను చదివి అంగీకరించడమయినది.

3. ఈ సంఘముక్రింద కార్యాలయము పేరుతో నిర్మించబడే భవనముయొక్కయు, ఖరీదుచేయబడిన స్థలముయొక్కయు లెక్కలు అలాయిదాగా వుంచవలెననియు, ఈ సంఘ నిర్వాహణమున కగు సాదాఖర్చులు, ఇతర లావాదేవీలతో కలుగు యేవిధమగు నష్టములును ఈ సంఘభవనములు గాని, స్థలమునుగాని బాధించగూడ దనియు తీర్మానించుచు ఈ యేర్పాటు అమలులోనికి వచ్చుటకు వలయు చర్య తీసికొనుటకు కార్యదర్శిని కోరడమయినది.

(సం.) వుప్పులూరి వెంకటకృష్ణయ్య
సభాధ్యక్షుడు

## కేంద్రశాఖాసంఘముల సంబంధము

5—8—39 వ తేదీన బెజవాడలో కూడిన ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పాలకవర్గమువారు నగర, తాలూకా, జిల్లా గ్రంథాలయ సంఘములకును, ఆం. దే. గ్రం. సంఘమునకును మధ్య నుండదగు సంబంధమును దిగువరీతిగ నిర్ణయించుచు, వివిధసంఘముల విధులను గూర్చి యొక పత్రికాళికను సిద్ధపరచవలసినదిగా కార్యదర్శికధికార మిచ్చిరి.

తీర్మానము ౧

1. ప్రతి గ్రంథాలయము ఆం. దే. గ్రం. సంఘములో సభ్యులుగ చేరవలెను. ఈసంఘములో సభ్యులుగచేరిన గ్రంథాలయములు జిల్లా, తాలూకా లేక నగరగ్రంథాలయసంఘములలో సభ్యత్వము కలిగియుండును. అవి చెల్లించు చందా రు 1—0—0లో తాలూకా లేక నగరగ్రంథాలయసంఘమునకు రు 0—8—0 లును, జిల్లాసంఘమునకు రు 0—4—0 లును, ఆం. దే. గ్రం. సంఘమునకు రు 0—4—0 లును చెందవలెను. నగర లేక తాలూకా గ్రంథాలయసంఘములు లేనిచోట్ల జిల్లా గ్రంథాలయ సంఘమునకును, ఆం. దే. గ్రం. సంఘమునకును చెరిసగము చెందవలెను. జిల్లాగ్రంథాలయసంఘములు లేనిచోట్ల నగర లేక తాలూకా గ్రంథాలయసంఘమునకు సగమును, ఆం. దే. గ్రం. సంఘమునకు సగమును చెందవలెను.

2. ఆం. దే. గ్రం. సంఘములో చేరిన సాధారణసభ్యులు వారి వారి జిల్లాసంఘములలోను, తాలూకా లేక నగరసంఘములలోను గూడ సభ్యులుగ నుందురు. వారి సంవత్సర చందాలలో ఒక నాల్గవవంతు తాలూకా లేక నగరగ్రంథాలయ సంఘమునకును, ఒక నాల్గవవంతు జిల్లాసంఘమునకును చెందవలెను.

పై తీర్మానము కేంద్ర, స్థానికసంఘముల మధ్యనుండదగు ఆర్థికసంబంధమును వివరించుచున్నది. దీని చివర "తాలూకా లేక నగరసంఘముగాని, జిల్లాసంఘముగాని లేనిచోట్ల ఆ యా సంఘముల బాధ్యతను నిర్వహించు సంఘమునకే వానివంతు చందా చెందును" అను మాటలను, 2. మొదటి పంక్తిలో సాధారణసభ్యులు తరువాత "గ్రామపంచాయతీ బోర్డులు, సహకారసంఘములు" అను మాటలను క్రొత్తగ "3. ఆం. దే. గ్రం. సంఘ నియమావళి I లో నుదహరింపబడిన 1, 2, 3, 4, 5, 11 తరగతుల సభ్యులును వారివారి జిల్లా, తాలూకా లేక నగరగ్రంథాలయసంఘములలో సభ్యులగుదురు. కాని ఈ సభ్యుల చందాలలో క్రిందిసంఘములకెట్టి భాగముగాని ఉండదు." అనుమాటలను చేర్చవలసియున్నది. మఱియు రాష్ట్ర, జిల్లా, తాలూకా, నగర గ్రంథాలయసంఘము లన్నిటియొక్క లక్ష్యము ఒక్కటే గనుక ఇవన్నియు తమతమ విధుల నెరవేర్చుచు, పరస్పరము దృఢమైన సంబంధము గలిగియుండుటకై క్రిందివిధాన మువకరించును.

### ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము

శాఖాసంఘముల స్థాపన, వాని పరిశీలన, వాని నిర్వహణమునకు తోడ్పడుట; ఆంధ్రదేశములో పనిచేయు గ్రంథాలయములకు అండగ నుండదగు కేంద్ర గ్రంథాలయ స్థాపనము, సలహా కేంద్ర (Information Bureau) నిర్వహణము; గ్రంథాలయ నిర్వహణమున కనుకూలించు శిక్షణతరగతుల ఏర్పాటు, గ్రంథపట్టికలు (Bibliographies), గ్రంథాలయ పట్టికలు (Library Registers) తయారుచేయించి ప్రకటించుట; ఉద్యమప్రచారమున కనుకూలించు పత్రికలు, కరపత్రములు, పుస్తకములు ప్రకటించుట, గ్రంథాలయ మహాసభలను ప్రదర్శనములను జరుపుట, గ్రంథాలయ ఫలకముల (Slides) తయారుచేయించుట; వయోజనుల విద్యాప్రణాళికను, దానిని నడుపుటకనువగు సాధనములను తయారుచేయించి దీనిని గ్రంథాలయములు అమలు జరుపునట్లు ప్రోత్సహించుట; విజ్ఞానాభివృద్ధికి సాయపడు వివిధవిషయములను గూర్చిన పుస్తకములను, పత్రికలను వ్యాప్తిలోనికి తెచ్చుటకై కృషిసల్పుటాదిగాగల కార్యక్రమమును కేంద్రసంఘము చేపట్టవలెను.

### జిల్లా లేక మండల గ్రంథాలయసంఘములు

ఇక జిల్లా లేక మండల గ్రంథాలయసంఘములు కేంద్రసంఘపక్షమున ఆ యా జిల్లాలలో తాలూకా, నగరగ్రంథాలయసంఘముల స్థాపించి, అవి సక్రమముగ నిర్వహింపబడునట్లును, కలసి గ్రంథాలయోద్యమవ్యాప్తికి కృషిచేయునట్లును చూచుచుండవలెను. తాలూకా, నగరసంఘములులేని తావుల వానిధర్మములగూడ జిల్లాసంఘములే పరిపాలింపవలెను. ఏటేట కార్య నివేదికల ప్రకటించుట, జిల్లా గ్రంథాలయ మహాసభలను ప్రతి సంవత్సరము ఒక్కొక్క తాలూకాలో జరుపుటయు జిల్లాసంఘములు చేయవలసిన కార్యములు.

ఈ జిల్లాసంఘములు మద్రాసు రాజధానిలో ప్రస్తుతముగల ఆంధ్రభాగమునందలి 11 జిల్లాలందేగాక మద్రాసు నగరమునందును, మైసూరు ఆంధ్రభాగమునందును, నిజాము రాష్ట్రము నందునుగూడ యేర్పడవలెను. ఇప్పుడు జిల్లాసంఘము లన్నిటికిని ఇద్దరు కార్యదర్శు లుందురు. ఆయా జిల్లాల ప్రతినిధులుగ ఆం. దే. గ్రం. సంఘపాలకవర్గమున కెన్నుకొనబడువారు అధికార రీత్యా తమ జిల్లా సంఘములకు కార్యదర్శు లగుదురు. రెండవ కార్యదర్శిని జిల్లాసంఘములే ఎన్నుకొనును. మఱియు ఆయా జిల్లాలలో కేంద్రసంఘమునకు శాఖలుగ నేర్పడిన తాలూకా, నగర గ్రంథాలయ సంఘముల కార్యదర్శులు ఎన్నికతో నిమిత్తము లేకనే జిల్లాసంఘ పాలకవర్గసభ్యులగుదురు. తక్కిన నిబంధనలు కేంద్రసంఘమువారి పరిశీలనకు లోబడి ఆయా జిల్లాసంఘములే గావించుకొనవచ్చును.

### తాలూకా, నగర లేక పట్టణ గ్రంథాలయసంఘములు

స్థానికముగ పనిచేయునవి తాలూకా, నగర లేక పట్టణ గ్రంథాలయ సంఘములే. కాన వీని నిర్మాణము మంచి పునాదులపై చేయబడు టవసరము. నగర లేక పట్టణసంఘములు తాలూకాసంఘ

ములతో సమానముగ చూడబడవలసి యున్నందున ప్రతి చిన్న బస్తీలో వీనిని స్థాపింపబూనుట సమంజసముగాదు. 10 గ్రంథాలయములకు తక్కువలేకుండ 50 వేలకు పైబడ్డ జనాభా గలిగినట్టి పట్టణము లందుమాత్రము అవసరమునుబట్టి నగర లేక పట్టణ గ్రంథాలయముల స్థాపించవచ్చును. 1931వ సం॥ పు జనాభా లెక్కలనుబట్టి విశాఖపట్టణము, కాకినాడ, రాజమహేంద్రవరము, ఏలూరు, బందరు, బెజవాడ, గుంటూరు పురములలో మాత్రము నగరగ్రంథాలయ సంఘముల స్థాపించుట కవకాశము లున్నవి.

తాలూకా, నగర లేక పట్టణ సంఘములు గ్రామములలో యాత్రలు, ప్రదర్శనములు, ఉపన్యాసాదులు ఏర్పాటుచేసి నూతనముగ గ్రంథాలయ పఠనాలయముల స్థాపించుటకును, మూలబడిన గ్రంథాలయముల లేవనెత్తుటకును, పనిచేయుచున్న గ్రంథాలయములనుండి మాసవారి నివేదికల తెప్పించి సంవత్సరమున కొకతూరి జిల్లా, రాష్ట్ర సంఘములకు వాని సంక్షిప్తచరిత్రలను పంపుటకును, ఒక్కొక్క తాలూకా లేక నగరములోని వివిధగ్రంథాలయము లన్యోన్య సహకారముతో నడచునట్లు చేయుటకై వాని నిర్వాహకుల తరచు సమావేశము చేయుచు వారిమధ్య పరస్పర పరిచయ స్నేహము లభివృద్ధినందునట్లు ప్రయత్నించుటకును, ఏటేట గ్రంథాలయ మహాసభల నేర్పాటు చేయుచు తమపైనున్న జిల్లా రాష్ట్రసంఘముల సలహాల ననుసరించి వాని పరిశీలనకు లోబడి తమ కార్యక్రమమును సాగించవలెను.

గ్రంథాలయములును, గ్రంథాలయ సంఘములును మాసవారి నివేదికలను తమ పైసంఘములకు తప్పక పంపుచుండవలెను. ఈ పద్ధతివలన కేంద్రసంఘమునకు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ సమాచారములు కరతలామలకముగ నుండును. అప్పుడిది ప్రజాభిప్రాయము నాకర్షించగలుగును. దీనితో ప్రభుత్వమును మన పనిని గుర్తించుటకు వీలుచిక్కును. కేంద్రసంఘము జీవించియున్నంతవరకు క్రింది సంఘములు నిద్రించుటయు పొసగదు. బెజవాడ సమావేశములో (5-8-39వ తేదీ) నిర్ణయింపబడిన ఆర్థిక సంబంధము వివిధసంఘముల నొకేసూత్రమున బంధించుచున్నందున పోటీలేక అన్నిసంఘములును కలిసి పనిచేయగలుగును.

కేంద్రసంఘ సభ్యులగుట కేర్పాటుచేయబడిన కనీస సంవత్సరచందా మొత్తము (రు 1-0-0) సామాన్యుల కందుబాటులో లేనందున తాలూకా, నగర లేక పట్టణ గ్రంథాలయసంఘములు ప్రత్యేకము తమ సంఘములలో సభ్యులుకాగోరు వ్యక్తులకు సంవత్సరమునకు రు 0-4-0 కు తక్కువగాని చందాను నిర్ణయించవచ్చును. రు 1-0-0 చెల్లించువారు జిల్లారాష్ట్రసంఘములలోనుగూడ సభ్యులగుదురు. అందువలన అన్నిసంఘములును కేంద్రసంఘసభ్యులను విడివిడిగను, కలసి చేర్చుటకును అవకాశ ముండును. ఆయాసంఘముల భాగములలెక్క క్రమముగనుండుటకై కేంద్రసంఘమువారు సప్లైచేయు రశీదుపుస్తకములనే అందరు నుపయోగించవలెను. సంవత్సరమున కొకపర్యాయము కేంద్రసంఘమువారు జిల్లాసంఘముల లెక్కలను, వారు తాలూకా, నగర లేక పట్టణ సంఘముల లెక్కలను పరిశీలించుచుందురు. ఏ సంఘముగాని తాను వసూలుపరచు చందాలనుండి తమవంతుకు మించి వెచ్చించకుండునట్లు నిబంధన నేర్పాటుచేసికొన్న ఈ విషయమై ఎట్టి చిక్కుగాని కలుగదు.

ఈ విషయముల నన్నిటిని పరిశీలించి అవసరమైన సవరణల ప్రతిపాదించి మన సంఘ కార్యక్రమము కట్టుదిట్టముతో నిరంతరాయముగ సాగునట్లు పాలకవర్గమువారును, వివిధసంఘముల నిర్వాహకులును కృషిజేయబూనుదురని నమ్ముచున్నాను.

కార్యస్థానము:<br>పటమటలంక<br>(వయా) బెజవాడ

పాతూరి నాగభూషణం<br>కార్యదర్శి<br>ఆం. దే. గ్రం. సంఘము

## కృష్ణా జిల్లా గ్రంథాలయమహాసభ

కృష్ణాజిల్లా తొమ్మిదవ గ్రంథాలయ మహాసభ 7—9—39 వ తేదీ గుడివాడతాలూకా గురజగ్రామములో కాకినాడ వాస్తవ్యురాలును, తూర్పు గోదావరి జిల్లాబోర్డు సభ్యురాలును నగు శ్రీ వేమగంటి పాపాయమ్మగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయ ధర్మకర్తలు శ్రీమాన్ ఇరగవరపు నరసింహాచార్యులుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగ ప్రతినిధులకు స్వాగతము చెప్పినపిమ్మట శ్రీ మాజేటి రామచంద్రరావుగారు కార్యదర్శినివేదిక చదివిరి.

శ్రీ తేరుమళ్ళ రామచంద్రరావు ఎం. ఏ., బి. ఎల్. గారు సభను ప్రారంభించుచు ప్రాచీన కాలమున దేవాలయములు, మఠములు విజ్ఞానాభివృద్ధికి మిక్కుటముగ చేయూత నొసగుటవలన నైతికబద్ధమగు ఉన్నత నాగరికత మనదేశమున నప్పుడు ప్రబలముగ నుండెననియు, అట్లే నేటి గ్రంథాలయములును సంఘాభివృద్ధికి సాయపడుటలో సాటిలేని సాధనములనియు వచించిరి. అనంతరము అధ్యక్షురాలు గ్రంథాలయ నిర్వహణనుగూర్చి అనుభవపూర్వకమగు తమ యుపదేశములచే సభికుల నానందపరచిరి. స్త్రీలవిషయమై గ్రంథాలయము లెక్కువ బాధ్యతతో పనిచేయు టవసరమని వారుపన్యసించిరి.

పై యుపన్యాసముల అనంతరము శ్రీయుతులు తేరుమళ్ళ రాజగోపాలరావు, రఘుపతి వెంకటరత్నం నాయుడు, చిలుకూరి వీరభద్రరావుగార్ల మరణములకు సంతాపమును వెలిబుచ్చుచు, వారి కుటుంబములకు సానుభూతి తెలియజేయుచును; బొంబాయి, బీహారు, సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వములు నిరక్షరాస్యతా నిర్మూలనమునకు పూనినందుకు వారి నభినందించుచు, మద్రాసుప్రభుత్వమువారి నీ పని చేయవలసినదిగ హెచ్చరించుచును; గ్రంథాలయములు రిజిస్టరుచేయించుటకై చెల్లించవలసిన రుసుము రు 50—0—0 లను రద్దుచేయవలసినదిగ ఇండియాప్రభుత్వమువారిని కోరుచును తీర్మానములు చేయబడెను. మరికొన్ని తీర్మానములు చేయబడి కడకు 1939—40 సంవత్సరకు కృష్ణా జిల్లా గ్రంథాలయసంఘమునకు శ్రీ తేరుమళ్ళ రామచంద్రరావుగారు అధ్యక్షులుగను, శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారు ఉపాధ్యక్షులుగను, మాజేటి రామచంద్రరావు, మల్లెల శ్రీరామమూర్తిగార్లు కార్యదర్శులుగను ఇంకను 25 మంది సభ్యులతో కూడిన కార్యవర్గ మేర్పాటు చేయబడెను.

అధ్యక్షురాలి అంత్యోపన్యాసము, ఆహ్వానసంఘమువారి వందనసమర్పణములతో సభ జయప్రదముగ ముగిసెను.

## గుంటూరు మండల గ్రంథాలయ సంఘ సమావేశము

25-12-39 వ తేదీ పై సంఘ సాధారణ సమావేశము తెనాలి కాంగ్రెసు కార్యాలయమున శ్రీయుత శరణు రామస్వామి చౌదరిగారి అధ్యక్షతనుకూడి దిగువ తీర్మానముల గావించెను.

౧. ఈక్రింది అంశములుగల గ్రంథాలయములు కేంద్ర గ్రంథాలయములుగ పరిగణింపబడును.

(అ) గ్రంథాలయములో 2 వేలకు తక్కువగాని గ్రంథము లుండవలెను.

(ఆ) ప్రతి సంవత్సరము రు 100-0-0 లకు తక్కువ గాకుండ పుస్తకములను సేకరించవలెను.

(ఇ) తనచుట్టుగల 5 మైళ్ళ యేరియాలోని గ్రామములలో గ్రంథములను విధిగ అందజేయవలెను.

(ఈ) తన యేరియాలోగల అందరకు పుస్తకములను ఉచితముగ ఇవ్వవలెను.

(ఉ) ప్రతి కేంద్ర గ్రంథాలయమునకు నెల 1 కి రు 15-0-0 లకు తక్కువ గాకుండ ఒక గ్రంథ భాండాగారకుని, రు 10-0-0 లకు తక్కువగాకుండ ఒక నౌకరును వేతనముమీద నియమించవలెను.

(ఊ) ఒంగోలు, వినుకొండ, పల్నాడు, నరసరావుపేట, సత్తెనపల్లి, గుంటూరు తాలూకాలలో కేంద్ర గ్రంథాలయమునకు ప్రస్తుతము 1000 పుస్తకములున్న చాలును.

౨. ఇట్టి ప్రతికేంద్రగ్రంథాలయమునకు రు 300-0-0 లకు తక్కువగాకుండ వార్షిక విరాళము నిచ్చుచుండుటకు గుంటూరుజిల్లాబోర్డువారి నీసంఘమువారు కోరుచున్నారు.

3. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు ప్రకటించుచున్న "ఆంధ్రగ్రంథాలయం"పత్రికకు జిల్లాలోని గ్రంథాలయములన్నియు చందాదారులుగా జేరి దానిని తెప్పించుకొనవలసినదిగ కోరడమైనది.

## విశాఖపట్టణము జిల్లాగ్రంథాలయ సంఘసమావేశము

21-10-39వ తేదీ మధ్యాహ్నము 2 గంటలకు అనకాపల్లిలోని శ్రీ శారదా గ్రంథాలయమునందు పై సంఘముయొక్క పాలకవర్గ సమావేశము శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారి అధ్యక్షతను కూడెను. పాలకవర్గ సభ్యులగు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి, పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు, ఉప్పల శ్రీరామమూర్తి, చుక్కా అప్పారావుగార్లు గాక మఱికొందరు ఉద్యమాభిమానులును సభకు విచ్చేసిరి.

క్రింది విషయములు చర్చింపబడి ఏకగ్రీవముగ ఆమోదింపబడెను.

1. విశాఖపట్టణము జిల్లాకేంద్ర గ్రంథాలయమును నెలకొల్పుటకై స్థలనిర్ణయము చేయబడినది.
2. గ్రంథాలయోద్యమవ్యాప్తికై కృషిసల్పుట కేర్పాటులు గావించుకొనుటకు నిశ్చయింపబడినది.
3. ఆంధ్రభాషాభివృద్ధి ఆంధ్రరాష్ట్రసిద్ధిపై ఆధారపడియున్నందున, రాష్ట్రసిద్ధికి తోడ్పడు వ్యాసములను, కరపత్రములను తయారుచేయించి ఆంధ్రులందరికీ అందచేయుటకు తీర్మానించబడినది.
4. ఈ సంఘమునకు క్రిందివారిని నూతన పాలకవర్గముగ నెన్నుకొనడమైనది.
   అధ్యక్షులు : మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు
   ఉపాధ్యక్షులు : ఉప్పల శ్రీరామమూర్తి, దిగుమర్తి రామస్వామి, ఎం.ఎల్.ఏ., విన్నకోట జగన్నాథముగుప్త, ఎం.ఎల్.ఏ., పసుమర్తి వీరభద్రస్వామి. ఎం.ఎల్.సి., గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగార్లు
   కార్యదర్శులు : పీతాంబరం వేంకట కృష్ణమాచార్యులు, గ్రంధి కన్నయ్యపంతులు, మల్లిమడుగుల జగన్నాథరావుగార్లు
   సంచారకార్యదర్శి : గంటి సూర్యనారాయణశాస్త్రిగారు
   సభ్యులు : కొత్త సన్యాసయ్యశ్రేష్ఠి, జయంతి సుబ్బారావుగార్లు.
   ఇంకను అర్హులైనవారిని చేర్చుకొనుటకు వీరి కధికార మీయడమైనది.
5. ఈ సంఘమును ఆం. దే. గ్రం. సంఘమునకు శాఖాసంఘముగ చేయ నిశ్చయించడమైనది.

## గుంటూరు తాలూకాగ్రంథాలయ మహాసభ

27-8-39 వ తేదీ గుంటూరు హిందూకాలేజి భవనమున సమావేశమైన పై గ్రంథాలయ మహాసభకు సర్దార్ దండు నారాయణరాజు యం. యల్. యే. గా రధ్యక్షత వహించిరి. తాలూకాయందలి ముఖ్య గ్రంథాలయము లన్నిటినుండి ఈ సభకు ప్రతినిధు లరుదెంచిరి. ఈసభకు హాజరైన వారిలో శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు, తాయసం వెంకటశివుడుగారు, మందలపర్తి ఉపేంద్ర శర్మగారు ముఖ్యులు.

అధ్యక్షుని ఉపన్యాసానంతరము కార్యదర్శి నివేదిక చదువబడి కొన్ని తీర్మానములు చేయబడెను. ఇందు ముఖ్యమైనవి.

1. గ్రామగ్రంథాలయములు 180 వ సం॥ 21 వ సొసైటీల ఆక్టు ననుసరించి చెల్లించవలసిన రిజిస్ట్రేషను రుసుము రు 50 లు తీసివేయవలసినదిగ ఈ సభవారు ప్రభుత్వమును కోరుచున్నారు.

2. ఆంధ్రదేశమందలి, గ్రామగ్రంథాలయములందలి గ్రంథభాండాగారికులకు తగిన తరిబీతు నిచ్చుటకు శిక్షణ తరగతుల నేర్పాటు చేయవలసిన దనియు, అట్టి తరగతులకు కావలసిన పాఠ్య గ్రంథములను వెంటనే తయారు చేయవలసినదనియు ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమువారి నీసభవారు హెచ్చరించుచున్నారు.

సభాంతమున గుంటూరు తాలూకా గ్రంథాలయసంఘమునకు నూతన కార్యనిర్వాహక వర్గ మెన్నుకొనబడెను. దీనికి శ్రీరాయసం వెంకటశివుడుగా రధ్యక్షులుగను, శ్రీ పెళ్ళూరి నాగభూషణం గారు కార్యదర్శిగను నేర్పాటు చేయబడిరి. ఈసంఘ కార్యస్థానము గుంటూరు బ్రాడీపేటయందున్న కార్యదర్శిగారి గృహమందుండును.

## తెనాలి తాలూకాగ్రంథాలయ సంఘవము

బోటుగ్రంథాలయవము : తె. తా. గ్రం. సంఘమువారు 5—2—39 వ తేదీ ఉదయము తెనాలి నుండి బయలుదేరు నిజాంపట్నము ప్రయాణీకుల పడవలో పఠనాలయము నొకదానిని ప్రారంభించియుండిరి. వేసవికాలములో ఆగిపోయిన దీనిని తిరిగి 6—8—39 వ తేదీ ప్రారంభించిరి. ఈ ప్రారంభోత్సవము తురుమెళ్ళగ్రామమున అచ్చటి బోర్డు హైస్కూల్ ప్రధానోపాధ్యాయులగు శ్రీయుత పి. దక్షిణామూర్తి బి. ఏ., ఎల్. టి. గారి అధ్యక్షతను జరిగెను. అమృతలూరు సంస్కృత పాఠశాలా ప్రధానోపాధ్యాయులు శ్రీ నాగలింగం వేంకటేశ్వర శర్మగారు ప్రారంభోపన్యాసము గావించిరి. ఒక దినపత్రికయు, ముఖ్యములగు తెలుగు వార, పక్ష, మాసపత్రికలును పై పడవలో ప్రయాణీకుల ఉపయోగం నిమిత్తం ఉంచబడుచున్నవి. ఈ సంవత్సరం తెనాలితాలూకా కాంగ్రెస్ సంఘమువా రీయేర్పాటునకుగాను రు 15—0—0 విరాళముకూడ నిచ్చిరి.

గ్రంథాలయయాత్ర : 29—9—39 వ తేదినుండి 4—10—39 వ తేదివరకు తె. తా. గ్రం. సంఘమువారు దుగ్గిరాలఫిర్కాలో 15 గ్రామములలో (చింతలపూడిగాక) ప్రచారము గావించి 13 గ్రామములలో సభలను, 3 చోట్ల మ్యాజికులాంతరు ప్రదర్శనములను జరిపిరి. ఈ ప్రచారము ఫలితముగ దుగ్గిరాలలోను, పేరకలపూడిలోను 2 గ్రంథాలయములు పునరుద్ధరింపబడినవి. చిలువూరు, మంచికలపూడిగ్రామములలో నూతనముగ పఠనాలయములు ప్రారంభింపబడినవి. క్రమముగ లేని గ్రంథాలయములికముందు చక్కగ సాగింపబడుటకు హెచ్చరింపబడినవి. అన్నిగ్రంథాలయముల కును నిర్వహణవిషయమై సలహాలీయబడి కొన్నింటికి నూతనకార్యములను చేపట్టునట్లు ప్రోత్సాహమీయబడినది.

దుగ్గిరాల హైస్కూల్ భవనమున 29—9—39 వ తేదీ సాయంత్రము 5 గంటలకీ కార్యక్రమము ప్రారంభమయ్యెను. గ్రంథాలయప్రబోధకములగు పాటలతోను, జయజయధ్వానములతోను గ్రామ పర్యటనము పూర్తియైనతదుపరి కూడిన పౌరసభకు దుగ్గిరాల సబ్ రిజిస్ట్రారు శ్రీ జి. నాగభూషణ దేవరగా రధ్యక్షత వహించిరి, ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు యాత్రా కార్యక్రమమును ప్రారంభించుచు గ్రంథాలయోద్యమముయొక్క ఉత్కృష్టతనుగూర్చియు, గ్రంథాలయధర్మమును గూర్చియు నుపన్యసించిరి. 1912 వ సం॥లో స్థాపింపబడి, కొంతకాలము చక్కగ పనిచేసి తదుపరి మూలబడిన దుగ్గిరాల శ్రీ భాషాభిలాషిణీసంఘ గ్రంథాలయ పూర్వచరిత్రను

శ్రీ జంపాల వేంకట నృసింహము, కన్నెగంటి వెంకటరామయ్యగార్లు చెప్పిరి. శ్రీ నన్నపనేని శ్రీరాములుగారిచే గ్రంథాలయ ప్రబోధ పద్యములు చదువబడి అధ్యక్షుని తుదిపలుకులు, వందన సమర్పణములతో సభ ముగిసెను.

4-10-39వ తేదీ కొలకలూరులో స్థానిక కాంగ్రెసు కార్యాలయమున తె. తా. గ్రం. సంఘ పాలకవర్గము సమావేశమై తమపదవికి రాజీనామానిచ్చిన శ్రీ గుండవరపు వెంకటేశ్వర్లుగారిస్థానే శ్రీ పుచ్చా సత్యనారాయణగారిని కార్యదర్శిగ నెన్నుకొనెను.

ఈ యాత్రలో శ్రీ పాతూరి నాగభూషణం, పుచ్చా సత్యనారాయణ, కోగంటి రాఘవయ్య (తె. తా. గ్రం. సంఘాధ్యక్షులు) కాట్రగడ్డ రాజగోపాలరావు (కృష్ణాజిల్లా యువజనసంఘ కార్యదర్శి) వావిలాల గోపాలకృష్ణయ్య మున్నగువారు పాల్గొనిరి.

## నందిగామ తాలూకాగ్రంథాలయ మహాసభ

13-12-39వ తేదీ పై మహాసభ జగ్గయ్యపేటలో శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్యగారి అధ్యక్షతను జరిగెను. శ్రీ గరికిపాటి కృష్ణమూర్తిగారు ప్రతినిధులకు స్వాగతమిచ్చిరి. శ్రీ కొణకంచి చక్రధరరావుగారు సభను ప్రారంభించిరి. యద్దనపూడి రామబ్రహ్మంగారు కార్యదర్శి నివేదికను చదివి వినిపించిరి. అనుముల రామగోవిందశర్మ, మల్లెల శ్రీరామమూర్తి (ఆం. దే. గ్రం. సంఘ సహాయ కార్యదర్శి) డాక్టరు మొరిసెట్టి బసవరాజు, డాక్టరు మురహరిగార్లుపన్యసించిరి. నందిగామ తాలూకా గ్రంథాలయసంఘమునకు స్థాయిసంఘసభ్యులు కొందరు చేర్చుకొనబడిరి. తాలూకాలో గ్రంథాలయప్రచారమును సాగించుటకొకఉపసంఘ మేర్పాటుచేయబడెను. తాలూకాయందలి బోర్డుపాఠశాలలోని గ్రంథాలయములను ఆయా గ్రామస్థు లుపయోగించుకొనుట కవసరమైన ఏర్పాటుల చేయుటకును, 2 వేలకుపైబడ్డ జనాభా కలిగిన తాలూకాలోని గ్రామములన్నింటను గ్రంథాలయముల నేర్పాటుచేయుటకును, తాలూకాలో ప్రచారమునకై సంచారగ్రంథాలయ శకటమును నెలకొల్పుటకును కృష్ణాజిల్లాబోర్డువారు కోరబడిరి. సారస్వతసేవకులును, గ్రంథాలయోద్యమ నాయకులును నగు శ్రీకొణకంచి చక్రధరరావుగారి షష్టిపూర్తిమహోత్సవమును జరిపి వారు రచించిన గ్రంథములన్నింటిని ముద్రించు నేర్పాటులొనర్చుటకొక యుపసంఘమేర్పాటుచేయబడెను.

## పల్నాడుతాలూకా గ్రంథాలయమహాసభ

13-12-39 వ తేదీ తాడెపూడిగ్రామములో సమావేశమైన పల్నాడుతాలూకా గ్రంథాలయ మహాసభకు గుంటూరుమండలగ్రంథాలయ సంఘాధ్యక్షులగు శ్రీశరణు రామస్వామిచౌదరిగా రధ్యక్షత వహించిరి. గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులగు శ్రీ కల్లూరి చంద్రమౌళి బి. యస్. సి. గారు సభను ప్రారంభించిరి. వీరిరువురును గ్రంథాలయావశ్యకత, ప్రాచీన గ్రంథాలయములు, ఆధునిక గ్రంథాలయోద్యమ తత్త్వము మున్నగు విషయములపై విపులముగ మాట్లాడిరి. త్రివేణీపత్రికా సంపాదకులగు శ్రీకోలవెన్ను రామకోటీశ్వరరావు, యం. యల్. యే. మంతెన వెంకటరాజు, తోట రామకోటయ్యగార్లు గ్రంథాలయోద్యమమును గూర్చియు, ప్రస్తుత ప్రపంచ పరిస్థితులను గూర్చియు ఉపన్యసించిరి.

తదుపరి తమ యేరియాలోనున్న రిజిష్టరైన గ్రంథాలయము లన్నిటికీ విరాళముల నిచ్చిన గుంటూరు జిల్లాబోర్డువారిని అభినందించుచు, ఇటీవల కొంతకాలమునుండి గ్రంథాలయములకు గ్రాంటుల నిచ్చుటకు మానిన మద్రాసు ప్రభుత్వవారి చర్యకు విచారించుచు, ఇక ముందైన వీనికి తప్పక గ్రాంటుల నిచ్చుచుండ వలసినదిగ కోరుచు, పల్నాడు తాలూకాలోని అన్ని గ్రామములందును, గ్రంథాలయముల స్థాపించవలసినదిగ తాలూకావాసుల హెచ్చరించుచు తీర్మానములు చేయబడి

నూతనముగ నేర్పాటు చేయబడిన పల్నాడుతాలూకా గ్రంథాలయ సంఘమునకు కార్యనిర్వాహక వర్గ మెన్నుకొనబడెను. గురిజాల వాస్తవ్యులగు శ్రీ కాపూరి వెంకయ్యగారు కార్యదర్శిగ నేర్పాటు చేయబడిరి. ఇంతటితో సభ జయప్రదముగ ముగిసెను.

### బందరుపట్టణ గ్రంథాలయసంఘ పునరుద్ధరణ

8—9—39 వ తేదీ సాయంత్రం 5½ గంటలకు బందరు శ్రీ రామలింగేశ్వరస్వామివారి ఆలయమందు జరిగిన బందరుపురవాసులసభకు శ్రీ తేకుమళ్ల రామచంద్రరావు ఎం. ఏ; బి. ఎల్ గా రధ్యక్షతవహించిరి. 9 వ కృష్ణాజిల్లా గ్రంథాలయమహాసభాధ్యక్షురాలు శ్రీ వేముగంటి పాపాయమ్మ గారు తమ ప్రారంభోపన్యాసమునందు ప్రాచీన, వర్తమానకాలములందలి గ్రంథాలయములు, స్త్రీవిద్య మహిళాగ్రంథాలయములు మున్నగువిషయములపై విపులముగ నుపన్యసించిరి. బందరుపట్టణ గ్రంథాలయసంఘము పునరుద్ధరింపబడి దీనికి శ్రీ పురాణం సూరిశాస్త్రిగా రధ్యక్షులుగను, వేమూరి పరబ్రహ్మ శాస్త్రిగారు కార్యదర్శిగను నూతన కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడెను.

---

## నూతన గ్రంథాలయాలు

**పూతలపట్టు పఠనాలయము :**

చిత్తూరుజిల్లా పూతలపట్టుగ్రామ వాస్తవ్యులు 30-8-39 వ తేదీన పఠనాలయము నొకదానిని ప్రారంభించిరి. గ్రామమునసబు శ్రీ సుబ్బారెడ్డి మున్నగువారు దీనికి ప్రోత్సాహకులు. దీని ప్రారంభోత్సవమునకు శ్రీ పార్థసారథి అయ్యంగారు ఎమ్. ఎల్. ఏ. ను చిత్తూరు డెప్యూటీ కలెక్టరు బజాజ్ సయ్యద్ అహమ్మద్ బహదూర్ గారును హాజరై, గ్రామస్థులను ప్రోత్సహించుచు నుపన్యాసములు చేసిరి.

**శ్రీ వేణుగోపాల గ్రంథాలయము :**

7-9-39 వ తేదీ గుడివాడ తాలూకా గురజ గ్రామమునందు శ్రీవేణుగోపాలస్వామివారి ఆలయమునందు "శ్రీవేణుగోపాల గ్రంథాలయము" స్థాపించబడెను. దీనిని ఆం. దే. గ్రం. సం. సహాయ కార్యదర్శి శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు ప్రారంభించిరి. ఈసమయమున 'కృష్ణావతార తత్వము'ను గూర్చి గొట్టిముక్కల కృష్ణమాచార్యులుగారును 'గ్రంథాలయోద్యమము'ను గూర్చి అయ్యంకి వెంకటరమణయ్య, పుచ్చా వెంకట్రామయ్యగార్లును ఉపన్యసించిరి.

**శ్రీతిలక్ పఠనమందిరము:**

22-10-39 వ తేదీన తెనాలితాలూకా చిలువూరు గ్రామంలో శ్రీ సూరపనేని రామశేషయ్యగారి ఆధిపత్యముక్రింద 'తిలక్ పఠనమందిరము' అను పేరుతో నూతనముగ నొక పఠనాలయము ప్రారంభింపబడెను. ఇది ప్రస్తుతము ప్రాత మునసబుగారి గృహమందుంచబడినది. గ్రామమందలి యువకులు దీని అభివృద్ధికై కృషి చేయుచున్నారు.

**జయపురం ఆంధ్రగ్రంథాలయం :**

28-10-39 వ తేదీ జయపురంలో శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుగారి ఆధిపత్యమున కూడిన సభలో పై గ్రంథాలయము స్థాపించబడెను. దీనికి శ్రీ నిడదవోలు నారాయణరాజుగా రధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

శ్రీ వాసిరెడ్డి సుబ్బమాంబ గ్రంథనిలయము :

8-11-39 వ తేదీ దివితాలూకా వెలువోలు గ్రామమున కీ. శే. వాసిరెడ్డి సుబ్బమాంబ గారి జ్ఞాపకార్థము వారి కుమార్తె శ్రీ దేవభక్తుని బసవనాగసత్యవరప్రసూనాంబగారిచే నిర్మింపబడిన భవనమందు పై గ్రంథాలయ ప్రారంభోత్సవము జరిగెను. శ్రీ కోగంటి రామచంద్రయ్యగారీయుత్సవమున కాధ్వర్యమువహించిరి. 250 పుస్తకములతో నీ గ్రంథాలయము ప్రారంభింపబడెను.

మద్రాసు కార్పోరేషను ఉచిత పఠనమందిరము :

10-11-39 వ తేదీ మైలాపూరునందలి వీరపెరుమాళ్ కోవెలవీధిలో మద్రాసు కార్పొరేషను వారు పై పఠనమందిరమును స్థాపించిరి. దీని ప్రారంభోత్సవమును శ్రీమాన్ యస్. శ్రీనివాసయ్యంగారు జరిపిరి. సభకు మేయరు సత్యమూర్తిగా రధ్యక్షత వహించిరి.

సాహిత్యమండలి పఠనమందిరము:

29-11-39 వ తేదీ ఏలూరు సాహిత్యమండలివారు అచ్చటి దివ్యజ్ఞాన సమాజభవనమునందు పఠనమందిరము నొకదానిని నెలకొల్పిరి. దీని ప్రారంభోత్సవమును మండలి అధ్యక్షులు శ్రీ నండూరి సుబ్బారావుగారు జరిపిరి. సభకు శ్రీ సోమంచి సీతారామయ్యగా రధ్యక్షత వహించిరి.

శ్రీకృష్ణ పఠనమందిరము :

తెనాలి తాలూకా కూచిపూడిగ్రామంలో నూతనముగ తెరువబడిన శ్రీకృష్ణ పఠనమందిరము నకు డాక్టరు లక్కరాజు గోపాలరావుగా రధ్యక్షులుగను, పసుమర్తి సంగమేశ్వరరావుగారు కార్యదర్శిగను ఏర్పాటుచేయబడిరి.

తెనాలి పురపాలకసంఘ గ్రంథాలయశాఖ :

15-12-39 వ తేదీ తెనాలిలోని 5 వ వార్డునందు (ఇస్లాముపేటలో) తెనాలి మునిసిపల్ లైబ్రరీకి బ్రాంచియొకటి నెలకొల్పబడినది. ఇందు ముఖ్యముగ ఉర్దూగ్రంథములు, ఉర్దూపత్రికలును ఉంచబడుచున్నవి. ఇంగ్లీషు, తెలుగు పత్రికలుకూడ కొన్ని ఇచ్చట నుంచుట కాలోచనలు జరుగుచున్నవి.

## వార్షికోత్సవములు వగైరా

శ్రీ దుర్గా పఠనమందిరము : నూజివీడు (కృష్ణాజిల్లా)

17-9-39 వ తేదీ సాయంకాలము నూజివీడు శ్రీదుర్గాపఠన మందిరము యొక్క వార్షికోత్సవము ఉయ్యూరు కుమారరాజా శ్రీ శ్రీ రాజా రంగయ్యాప్పారావు బహద్దరుగారి ఆధిపత్యమున జరుపబడెను. నాటి ఉదయము జరిగిన కార్యసంఘసభలో శ్రీ వల్లూరి సూర్యప్రకాశరావు, దోనేపూడి శ్రీరాములుగార్లు వరుసను అధ్యక్షకార్యదర్శులుగ నెన్నుకొనబడిరి.

శ్రీ సరస్వతీ నిలయము : ఖాజీపాలెము (బాపట్లతాలూకా)

పై గ్రంథాలయముయొక్క అష్టమవార్షికోత్సవము 20-9-39 వ తేదీ గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ కల్లూరి చంద్రమౌళి, బి. యస్. సి., ఎమ్. ఎల్. ఏ. గారి ఆధిపత్యమున జరుపబడెను. గుంటూరుజిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షులు శ్రీ మంతెన వెంకటరాజుగారు ప్రారంభోపన్యాసము నొసగిరి.

### శ్రీ హనుమన్నిలయగ్రంథాలయము : పున్నవ (గుంటూరుతాలూకా)

30-9-39 వ తేదీ జరిగిన పై గ్రంథాలయ ద్వితీయవార్షికోత్సవసభకు శ్రీ ఘంటా తిరుపతయ్యగా రధ్యక్షత వహించిరి. నూతన సంవత్సరమునకు వి. వేంకటరామయ్య పంతులుగారు గ్రంథాలయాధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

### శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము : హైదరాబాదు

హైదరాబాదు సుల్తానుబజారునందున్న పై గ్రంథాలయ 38 వ వార్షికోత్సవము 18-10-39 వ తేదీ సాయంత్రము నైజాం ఆంధ్ర మహాసభాధ్యక్షులును, 'రయ్యత్' పత్రికా సంపాదకులును నైన శ్రీ మందుముల నరసింగరావుగారి అధ్యక్షతను జరిగెను. శ్రీ మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి మున్నగు స్థానిక ప్రముఖులతోపాటు శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు కూడ సభ నలంకరించిరి.

అధ్యక్షులు తమ ప్రసంగమున పై నిలయము 33 సంవత్సరములలో గొప్పగొప్ప మార్పులను చెంది మహాసంస్థగ పరిణమించుట సంతసించదగిన విషయమనియు, నిజాంరాష్ట్రవాసులు గ్రంథాలయాభివృద్ధికై తగినంత కృషి సల్పుట లేదనియు, అచ్చటగల సుమారు 150 గ్రంథాలయములలో చాల భాగము శిథిలావస్థయందున్నవనియు, గ్రంథాలయములు ముఖ్యముగ విద్యావిహీనులకు, వ్యవసాయము మున్నగు వృత్తులపై జీవించు పాటకపు జనులకు పాఠశాలలుగ నుండవలెననియు చెప్పిరి. అనంతరం కార్యదర్శిగారైన శ్రీ వల్లూరి బసవరాజుగారు వార్షిక నివేదికను చదివిరి. లోగడ నీనిలయమున కుపాధ్యక్షులుగను, గ్రంథ పాలకులుగను సేవజేసిన కీ. శే. వేలూరి రంగధామ నాయుడుగారి యొక్కయు శ్రీమాన్ పి. బి. ఏ. ఆచార్యగారి యొక్కయు మరణములకు సంతాపము వెల్లడించుచు తీర్మానములు చేయబడిన పిమ్మట ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గ సభ్యులగు శ్రీమాన్ వేదాల తిరుమల వేంకట రామానుజస్వామిగారు గ్రంథాలయావశ్యకత, వాని అభివృద్ధికై చేయవలసిన కృషినిగూర్చి ముచ్చటించిరి.

ఈసందర్భమున నిచ్చట జరిగిన కవిసమ్మేళనమునకు అధ్యక్షత వహించిన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు 'కళ'నుగూర్చి విపులముగ నుపన్యసించిరి. ఈ కవిసమ్మేళనమున నిజాం రాష్ట్రమందలి కవులు, స్త్రీలు పురుషులుకూడ చాలమంది పాల్గొనిరి.

నన్నయంభట్టారకవర్ధంతి : 26-11-39 వ తేదీ సాయంత్రము పై గ్రంథాలయపక్షమున శ్రీ నన్నయ భట్టారకవర్ధంతి శ్రీమాన్ సి. హెచ్. రంగాచార్యులు (శిరోమణి)గారి అధ్యక్షతను జరుపబడెను. విద్వాన్ ఎస్. వి. దీక్షితులు, ఎం. ఏ., శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరంగార్లు నన్నయనుగూర్చి ఉపన్యసించిరి.

### శ్రీ శారదాగ్రంథాలయము : అనకాపల్లి

పై గ్రంథాలయముయొక్క తృతీయ వార్షికోత్సవము 21-10-39 వ తేదీ సాయంకాలము 4 గంటలకు కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి అధ్యక్షతను జయప్రదముగ జరిగెను.

### శ్రీ వివేకప్రదాయినీ గ్రంథాలయము : సోంపేట (విశాఖపట్నం జిల్లా)

2-11-39 వ తేదీ పై గ్రంథాలయముయొక్క సప్తమవార్షికోత్సవము శ్రీ ప్రగడ పట్టాభి రామయ్యగారి అధ్యక్షతను జరిగెను. గ్రంథాలయాధ్యక్షులు కె. అప్పారావుగారు గ్రంథాలయోద్యమమునుగూర్చి ఉపన్యసించిరి. కార్యదర్శి పి. శ్రీరాములుగారు గతవత్సర నివేదికనుచదివిరి.

### శ్రీ రాజేశ్వరీ గ్రంథాలయము : తేతలి (తణుకుతాలూకా)

12–11–39 వ తేదీ పై గ్రంథాలయ సప్తమవార్షికోత్సవము పాఠశాలల సహాయపరిశీలకులగు శ్రీ ఒంగోలు సుబ్బారావుపంతులుగారి అధ్యక్షతను జరిగెను.

డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు "గ్రామోద్ధరణము" సాగంగి నరసింహారావుగారు "ప్రస్తుత రాజకీయపరిస్థితులు" వేమూరి శ్రీనివాసరావుగారు "మానవులు ఆర్జించిన ధనమును పరలోకపు బ్యాంకులకు మార్చుట" రామశాస్త్రిగారు "సారస్వతము" అను విషయములనుగూర్చి ముచ్చటించిరి. పంచాయతీలు గ్రంథాలయములను పోషించుట కాటంకము గల్గించు మద్రాసు ప్రభుత్వము వారి ఇటీవలి చిత్తునిబంధన నామోదించకుండుటకై ప్రభుత్వము వారిని కోరుచు తీర్మాన మొకటి చేయబడెను.

### శ్రీ బాలగంగాధరతిలక్ పుస్తకాలయము : పెదపులివర్రు (రేపల్లెతాలూకా)

పై గ్రంథాలయముయొక్క 18వ వార్షికోత్సవము 14–11–39 వ తేదీ శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతను జయప్రదముగ జరిగెను. తెనాలి సంస్కృతోన్నత పాఠశాలా అధ్యాపకులు శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మగారు 'తిలక్ మహాశయుని జీవిత సందేశములు' గురించి మహోపన్యాసమును గావించిరి.

### శ్రీ మహాదేవ గోవిందరానడే గ్రంథాలయము : పాలకోడేరు (భీమవరంతాలూకా)

పై గ్రంథాలయముయొక్క 8 వ వార్షికోత్సవము 29-11-39 వ తేదీ పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు అధ్యక్షులు డాక్టరు మూల్పూరి రంగయ్యగారి అధ్యక్షతను జరిగెను. శ్రీమతి మూల్పూరు చుక్కమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, దండు నారాయణరాజు, అల్లూరి సత్యనారాయణ, కొవ్వలి గోపాలరావుగార్లు పలువిషయములనుగూర్చి ప్రసంగించిరి.

### శ్రీ బాలభారతీ గ్రంథనిలయము : కనగాల (రేపల్లెతాలూకా)

పై గ్రంథాలయముయొక్క ఆరవ వార్షికోత్సవము అఖిలభారత రైతునాయకులగు ఆచార్య రంగాగారి ఆధిపత్యమున 10–12–39 వ తేదీ మధ్యాహ్నము జయప్రదముగ జరిగెను.

గ్రంథాలయావశ్యకతనుగూర్చి, హిందూ మహమ్మదీయ ఐక్యతనుగూర్చి శ్రీమతి ఈడ్పుగంటి వెంకటరత్నమాంబ (ఆం. దే. గ్రం. సంఘ పాలకవర్గసభ్యులు), తత్వానందస్వామి, గాతు లచ్చన్న (విశాఖపట్నంజిల్లా), మహమ్మద్ ఇస్మాయిల్ సాహెబుగార్లుపన్యసించిరి.

### నెహ్రూ గ్రంథాలయము : గూడవల్లి (రేపల్లెతాలూకా)

10-12-39 వ తేదీ ఉదయము పై గ్రంథాలయ వార్షికోత్సవము ఆచార్య రంగాగారి అధ్యక్షతను జరిగెను. ఈసందర్భమున నేర్పాటుచేయబడిన గ్రంథాలయప్రదర్శనము శ్రీతత్వానంద స్వాములచే బహిరంగపరుపబడెను. శ్రీమతి ఈడుపుగంటి వెంకటరత్నమాంబగారును, మరికొందరును ఉపన్యసించిరి.

### కింగ్‌జార్జి ది ఫిఫ్త్ రీడింగ్ రూమ్ : తిరుత్తని (చిత్తూరుజిల్లా)

26-12-39 వ తేదీ జరిగిన పై పఠనాలయముయొక్క వార్షికోత్సవమునకు శ్రీ యం. రాజరత్నం బి. యే. (స్పెషల్ రివెన్యూ ఆఫీసరు) గారధ్యక్షత వహించిరి. గతవత్సర కార్యనివేదిక అంగీకరింపబడిన తదుపరి 1940 వ సం॥ నకు శ్రీ డి. మునిరత్నం నాయుడుగారధ్యక్షులుగను, డాక్టరు వి. శేషాద్రిగారు కార్యదర్శిగను కార్యనిర్వాహకవర్గ మేర్పాటు చేయబడెను.

### ఆంధ్రరత్న గ్రంథాలయ పునరుద్ధరణ :

చాలకాలముగ పనిలేక మూలబడియున్న తెనాలి మారీసుపేటలోని ఆంధ్రరత్న గ్రంథాలయము 28-10-39 వ తేదీ పునరుద్ధరింపబడినది. దీనికి సుమారు రు 5000-0-0 విలువచేయు దివ్యమగు స్వంతభవనము కలదు. శ్రీ రావి వెంకటసుబ్బయ్య చౌదరి (పట్టణ కాంగ్రెసు సంఘాధ్యక్షుడు) గారీ గ్రంథాలయము నభివృద్ధికి తెచ్చుటకై కృషి సల్పుచున్నారు. కొలదిపాటి గౌరవ వేతనముపై దీనికొక పాలకుడు నియమింపబడుటచే దీని నిర్వహణము నిరాటంకముగ సాగుచున్నది.

### శ్రీ భ్రమరా మల్లేశ్వరస్వాముల వారి పుస్తకభాండాగార పునరుద్ధరణ :

తెనాలితాలూకా అంగలకుదురు గ్రామములోని పై భాండాగారము 27-11-39 వ తేదీ పునరుద్ధరింపబడినది. ఈ సందర్భమున జరిగిన సభకు గుంటూరుజిల్లాబోర్డు సభ్యులు శ్రీకన్నెగంటి సూర్యనారాయణమూర్తి చౌదరిగా రధ్యక్షత వహించిరి. శ్రీవడ్లమూడి వెంకటరత్నం, పాతూరి నాగభూషణం గార్లు గ్రంథాలయములను గూర్చియు, శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి (కవిరాజు), చింతమనేని భావయ్య చౌదరిగార్లు మత, రాజకీయ విషయములను గూర్చియు నుపన్యసించిరి.

### శ్రీ దేశోద్ధారక గ్రంథాలయము : భవనప్రవేశ మహోత్సవము

ఒంగోలుతాలూకా ఉప్పుగుండూరు గ్రామమున నెలకొల్పబడిన పై గ్రంథాలయ నూతన భవన ప్రవేశ మహోత్సవము 2-11-39 వ తేదీ గుంటూరు మండల గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీశరణు రామస్వామిచౌదరిగారిచే జరుపబడెను. శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారు జాతీయపతాకమును గ్రంథాలయ భవనముపై ప్రతిష్ఠించిరి.

### శ్రీ శారదాగ్రంథాలయము : గాంధీజయంతి

తాడేపల్లిగూడెములో సతీహితసమితివారి పై గ్రంథాలయ యాజమాన్యమున 2-10-39 వ తేదీ గాంధీమహాత్ముని 71 వ జన్మదినోత్సవ మత్యంత వైభవముగ జరుపబడెను. ఈ సందర్భమున జరిగిన సమావేశమునకు శ్రీమతి అ. కమలమ్మగా రధ్యక్షత వహించిరి.

### ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము : బరంపురం

13-10-39 వ తేదినుండి 22-10-39 వ తేదివరకు పై సమాజమువారి యాజమాన్యమున దేవీ నవరాత్రి ఉత్సవములు జరుపబడెను. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, పండిత రామదాసు, వేమల సత్యనారాయణశాస్త్రి మున్నగువారలచే నిత్యమొక యుపన్యాస మిప్పింపబడెను. యువకులకు విద్యార్థులకు ఉపన్యాసపోటీల నేర్పరచి ఇందు తీర్ణులైనవారికి పుస్తకములు కొన్ని బహుమతిగ నొసంగబడెను.

---

## శ్రీ సారస్వతనికేతనము-వేటపాలెము

### (గుంటూరుమండలకేంద్ర గ్రంథాలయము)

పై గ్రంథాలయముయొక్క 21వ సం॥ నివేదిక మాకందినది. 16—9—38 వ తేదీనుండి 31–8–39 వ తేదీవరకు ఈ గ్రంథాలయపక్షమున నడచిన కార్యక్రమమిందు వివరింపబడినది.

దీనిపోషకవర్గమున 38 మంది సభ్యులుగలరు. శ్రీ వూటుకూరు జయరామదాసుగారు అధ్యక్షుడు & ధర్మకర్త; శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు గౌరవగ్రంథభాండాగారి.

గ్రంథములు - వాని ఉపయోగము : ఈ సంవత్సరములో చేర్చిన 456 తో కలసి సంవత్సరాంతమున గ్రంథాలయములో 9197 గ్రంథములుగలవు. ఇందు సంస్కృతాంధ్రములు 6512, ఇంగ్లీషు 2517, హిందీ & ఉర్దు 159, ఇతరభాషలు 9. నివేదిక సంవత్సరములో చదువబడిన గ్రంథములు 13,676. ఇండ్లకీయబడిన వానిలో పురుషులు 9746, స్త్రీలు 1394 గ్రంథములు చదివిరి.

చదువరులు : ఏలాటి రుసుము చెల్లింపనక్కరలేకయే గుంటూరుమండలవాసులెల్లరీ గ్రంథాలయము నుపయోగించుకొనవచ్చును.

ఈ సంవత్సరములో గ్రంథాలయమునకు 1129 మంది పురుషులు, 138 మంది స్త్రీలు అంగీకరింపబడిన పాఠకులుగనుండిరి. ఇందులో 523 మంది పురుషులు, 39 మందిస్త్రీలు గ్రంథములబొత్తుగా నుపయోగించలేదు.

సంచారశాఖ : ఈ శాఖద్వారా నివేదిక సంవత్సరములో 242 మంది చదువరులకు 2026 గ్రంథములందజేయబడినవి.

పఠనమందిరము : నివేదికకాలమున గ్రంథాలయ పఠనమందిరమునకు తెలుగు, ఇంగ్లీషు భాషలలో చేరి 41 పత్రికలు తెప్పించబడినవి. ఇందు దినపత్రికలు 3, పక్షపత్రికలు 4, వారపత్రికలు 8, మాసపత్రికలు వగైరా 26.

ఇతరసంస్థలతో సహకారము : ఈ నికేతనమునకు భారతగ్రంథాలయసంఘము (Indian Library Association), మద్రాసుగ్రంథాలయ సంఘము, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, గుంటూరుమండలగ్రంథాలయ సంఘములయందు సభ్యత్వము గలదు.

గ్రంథాలయవ్యాప్తి : నికేతనపక్షమున కొంతకాలము హిందీ పాఠశాలయు, వేసవిలో 19 దినములు వయోజనవిద్యాలయమును నిర్వహింపబడినవి. 2—10—39 వ తేదీన జరిగిన వార్షికసభ గాక 23–4–39 వ తేదీ నికేతన సంస్థాపకులగు కీ. శే. ఊ. వేం. శాస్త్రిగారి సాల్గవ వర్ధంతియు, 29–1–39 వ తేదీనుండి దేశోద్ధారకుని సప్తాహమహోత్సవమును నికేతనభవనమున జరుపబడినవి.

ప్రతి ఆదివారము జరుగు భజనకాలక్షేపములు గాక, వినాయకచవితి, దేవీనవరాత్రములందు పూజలు, సంవత్సరాదినాడు పంచాంగశ్రవణము, 7—2—39 వ తేదీ ఒక అష్టావధానము, 19—11—39 వ తేదీ 'లవణసత్యాగ్రహము'ను గూర్చిన హరికథ యేర్పాటు చేయబడినవి.

సిబ్బంది–లెక్కలు : గ్రంథభాండాగారిగాక నికేతనమునకొక గుమాస్తా, ఇరువురు సేవకులు, ఒక వృద్ధుమనిషి కలరు.

నివేదిక సంవత్సరాంతమునకు నికేతనమునకు రు12348—0—0 విలువచేయు మూలనిధి, స్థిరాస్తి గలవు. నివేదిక సంవత్సరములో గుంటూరుజిల్లాబోర్డువారు రు 200–0–0, వేటపాలెం పంచాయతీ బోర్డువారు రు 100–0–0 విరాళముల నికేతనమున కిచ్చిరి.

ఆదాయము 1174–7–0 వ్యయము 1154–10–3.

# ఆంధ్రేతర ప్రాంతములందలి వార్తలు

## అఖిలభారత రేడియో

**వివిధభాషలలో వార్తాప్రసారం:** ఇప్పుడు అఖిలభారత రేడియోవారు ఆంగ్లము, హిందూస్థాని, తెలుగు, తమిళం, గుజరాతి, మరాఠి, బెంగాలి, పష్టూ, పంజాబి, సెర్బియను భాషలలో వార్తాప్రసార మొనర్చుచున్నారు.

దీనికి సాయం, ప్రభుత్వం ప్రతిగ్రామములోను రేడియోవార్తలు వినేటందుకు తగిన సదుపాయాలు ఏర్పాటు చేస్తే అఖిలభారత రేడియోవారి వార్తాప్రసార విధానమందలి క్రొత్తమార్పులవల్ల నిజమైన ఉపయోగం కలుగుతుంది.

**కళాశాల విద్యార్థులకొరకు ప్రత్యేక ప్రసంగాలు:** ఇటీవలనే మదరాసు రేడియోస్టేషను వారు కళాశాలవిద్యార్థులకోసం ప్రత్యేక ప్రసంగసేవ ఏర్పాటుచేశారు. దివాన్ బహదూర్ యస్. ఇ. రంగనాథనుగారు ఈ ప్రత్యేకప్రసంగసేవను ప్రారంభిస్తూ, రేడియోద్వారా విద్యార్థులకు విజ్ఞానము నందజేసి కళాశాలలందలి విద్యకెట్లు సహాయముచేయవచ్చునో తెలియజేసిరి. సాయంత్రం 6-8 గంటలకు మధ్య నీరేడియోప్రసంగముల నేర్పాటుచేస్తే బాగుంటుందని రంగనాథనుగారు చెప్పారుకాని విద్యార్థులు స్టేషను డైరక్టరుతో నిష్టాగోష్ఠిగ మాట్లాడుతూ ఉదయం కళాశాల ప్రారంభించుటకు పూర్వమొక అరగంటసేపు ఏర్పాటుచేస్తే వీలుగాఉంటుందన్నారు. ఈ ప్రసంగాలు శాస్త్ర సాంకేతిక శైలిలోనుండే కష్టములేకుండా సులభగ్రాహ్యంగాను, అతిశయోక్తులు లేకుండా విశాలభావాల నలవరచేటట్టుగాను, వివిధవిషయములందు ఉత్సాహం పురిగొల్పేటట్టుగాను ఉండాలని యస్. ఇ. రంగనాథనుగారు సెలవిచ్చారు. చారిత్రకవిషయములను రాజనీతిశాస్త్రమును అభ్యసించు విద్యార్థులకు మాత్రమేకాక విద్యార్థులందరకీగూడ వర్తమానపరిస్థితులనుగూర్చిన ప్రసంగాలు చాలఉపయోగంగా ఉంటాయన్నారు. గొప్పగొప్ప పూర్వకవి విరచితములనుగూర్చి ప్రసిద్ధమగు ఆధునికకవుల రచనలనుగూర్చి రేడియోద్వారా ప్రసంగిస్తే విద్యార్థులందు పఠనాసక్తిని పెంపొందించుటకు అవకాశ ముందున్నారు. ఆశయాన్వితమగు యాత్రలనుగూర్చి ప్రసిద్ధపురుషుల జీవితములగూర్చి చెపితే విద్యార్థులందు ఉత్సాహము నూరించవచ్చునన్నారు.

విద్యార్థులకు ప్రత్యేకంగా రేడియో ప్రసంగాల నేర్పాటు చేయుడంలో ముందంజవేసిన మదరాసు రేడియోస్టేషనువారిని అభినందిస్తున్నాము. యస్. ఇ. రంగనాథనుగారి సూచనల ననుసరించియు, అనుభవశాలురచే నీప్రసంగముల జేయించియు మదరాసు రేడియోస్టేషనువారు విద్యార్థిలోకానికి ప్రశంసనీయమగు సేవజేస్తారని నమ్ముచున్నాము.

### వార్తాపత్రికల ప్రదర్శనశాల

1939 వ సంవత్సరం ఆగష్టు 27 వ తేదీని అలహాబాదులోని విద్యామండలివారు పత్రికల ప్రదర్శనశాలను స్థాపించారు. భారతీయపత్రికలు వివిధ భాషలలోనివి ఇచట ప్రదర్శింపబడును. ఇపుడు సజీవమైనవి, నిలచిపోయినవికూడ ఇక్కడ ప్రదర్శిస్తారు. ఇందు పరిశోధన కార్యములు, విద్యాప్రచారము జరుగుటకు అవకాశాలుంటవి. దేశములో వివిధప్రాంతములందు వార్షిక ప్రదర్శనములుగూడ జరుపబడును.

### భారతదేశ చరిత్ర

భారత ఇతిహాస పరిషత్తువారు డాక్టరు రాజేంద్రప్రసాద్ గారి యధ్యక్షతను సమావేశమై, భారతదేశచరిత్రను 20 సంపుటములుగా ప్రచురించుటకు సర్ జాదునాథ్ సర్కారు, జె. విద్యాలం

కారుగార్లు ప్రకటించిన స్కీము ఆమోదించారు. సంపాదకవర్గము నియమింపబడింది. వేరువేరు శాఖలు వేరువేరు ప్రముఖులచే రచింపబడతాయి. పరిష త్కార్యాలయం కాశీలో స్థాపించబడింది.

## గ్రంథాలయనిర్వహణమున శిక్షణ

కలకత్తా ఇంపీరియలు లైబ్రరీలో 1940 సంవత్సరారంభమున గ్రంథాలయనిర్వహణమందు శిక్షణనొసగడానికి ఏర్పాటుచేస్తారు. అవసరమగు వసతులు ఇంపీరియలు లైబ్రరీలో నేర్పాటు చేయబడినవి. ఇటువంటి శిక్షణతరగతు లిదివరలో మొదట 1935 లోను, తరువాత 1937, 1939 సంవత్సరములలోను జరుపబడెను. శిక్షణ కాలపరిమితి 6 నెలలు. శిక్షణానంతరం పరీక్ష జరుపబడును. 20 మంది విద్యార్థులకుమాత్రం స్థానముండును.

## శ్రీశాయాజీపఠనమందిరము, కాశీ

1939 వ సంవత్సరం సెప్టెంబరు 16 వ తేదీని పండితమదనమోహనమాలవ్యాగారు శ్రీశాయాజీ గయక్వాడ్ పఠనమందిర ప్రారంభోత్సవమునుజరిపారు. దర్భంగ మహారాజావారు చాలమంది విద్యార్థులు ఈసందర్భమున విచ్చేశారు.

## సర్ ఫజ్లీహుసేను స్మారకగ్రంథాలయం

1939 వ సంవత్సరం అక్టోబరు 23 వ తేదీని సర్ ఫజ్లీహుసేను స్మారకగ్రంథాలయ ప్రారంభోత్సవమును పంజాబుగవర్నరు సర్ ఫజ్లీహుసేనుగారుజరిపారు. గ్రంథాలయ శంకుస్థాపన 1937 అక్టోబరులో వైస్రాయి లిన్లితుగోప్రభువుచేశారు. పంజాబు అసెంబ్లీస్పీకరు సర్ షాహబుద్దీనుగారి అధ్యక్షతను ఒకకమిటీ ప్రజలనుండి విరాళములపోగుచేయుటకు ఏర్పాటుచేయబడింది. భవన నిర్మాణానికి ప్రజలు రు 74,850 లును పంజాబు ప్రభుత్వం రు 55,000లు ఇచ్చారు. గ్రంథాలయం ప్రాచీనగాథిక శిల్పవిధానంగా నిర్మింపబడి ప్రభుత్వకళాశాలప్రక్కన చక్కని వీథిలోనుండి రెండుమేడలు మూడు భూగర్భగదులు ఉన్నాయి. లక్షాముప్పయివేలు ఖర్చుఅయింది. ప్రారంభోత్సవ సందర్భమున కీర్తిశేషులగు సర్ ఫజ్లీహుసేనుగారి సత్కార్యముల తెలిపి యిటువంటి స్మారక చిహ్నము ప్రజలలోనుత్తేజమును కలుగజేయువని అధ్యక్షులు సెలవిచ్చారు.

## సరసపూరు గ్రంథాలయ భవన ప్రారంభోత్సవం

1939 వ సంవత్సరం డిసెంబరు 13 వ తేదీని అహమ్మదాబాదు పరిసరప్రాంతమైన సరసపూరులో సర్దారు వల్లభాయి పటేలుగారు ఒక గ్రంథాలయ ప్రారంభోత్సవమును జరిపారు. ఈభవనానికిగాను బొంబాయి వర్తకుడు భోగిలాలు పటేలుగారు 25 వేల రూపాయలు విరాళ మిచ్చారు. సర్దారు పటేలుగారు ఉపన్యసిస్తూ యిలా అన్నారు:

"నేను డబ్బు సంపాదించలేకున్నాను. దానిని ధర్మానికి దానం చేయలేకున్నాను. అయినా, భాగ్యవంతుల హృదయములను కరగించి, వారిని ధర్మకార్యాలకు తమడబ్బు ఖర్చుపెట్టునట్లు చేయగలుగుట నాకు ఓదార్పుగా నున్నది. బొంబాయిలో వర్తకులు కోట్లకొలది సంపాదిస్తున్నారు. కోట్లకొలది పోగొట్టుకుంటున్నారు. కాని డబ్బుసంపాదించి దానిని ధర్మకార్యానికి ఖర్చుబెట్టేవారు మాత్రమే నిజమైన సంపదకలవారు. ఈ ప్రాంతములో నుండేవారు ఎక్కువగా మిల్లుకార్మికులు. వారీ గ్రంథాలయమును చక్కగా వినియోగించుకొని అతివేగగతినిబోవుకాలంలో మారుచున్న పరిస్థితుల కనువగు జ్ఞానమును సంపాదించాలి."

---

# గ్రంథసమీక్షలు

**బ్రిటిష్ మహాయుగము : రెండు సంపుటములు కర్త—శ్రీమానికొండ సత్యనారాయణశాస్త్రి**
**సేవాశ్రమగ్రంథమాలా ద్వితీయ, తృతీయకుసుమములు**

స్వరాజ్యసంపాదనకు అత్యావశ్యకమైనది జాతీయదృష్టి. భారతీయవిజ్ఞానము జాతీయత నతిక్రమించిపోయి విశ్వమానవత్వమునే ఆదర్శప్రాయముగ పరిగణించుచున్నది. కాని నేడు మనదృష్టి కొంతవరకు విశ్వమానవత్వమునుండి మరలి భారతభూమిని విశ్వమునుండి కొంతవరకు ప్రత్యేకించి జాతీయదృష్టితో జూచుట కలవాటుపడినది. దీనికి కారణము ఆధునికవాఙ్మయము; ముఖ్యముగ రాజకీయ, చారిత్రక వాఙ్మయము.

'హైందవులకు చారిత్రకదృష్టిలేదు' అనుట పరిపాటియైనది. కాని చారిత్రకదృష్టియున్నను లేరన్నను, హైందవచారిత్రకగ్రంథములు మాత్రము చాల తక్కువయనుట నిర్వివాదాంశము. ఇప్పుడిప్పుడే ఆంగ్లమున హిందూదేశచరిత్రలు బయలుదేరుచున్నవి ఆంధ్రదేశమునకూడ కీర్తిశేషులు చిలుకూరి వీరభద్రరావుగారు, కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుగారు మొదలగు మహామహులు గట్టిప్రయత్నములుచేసి చరిత్రయనదేమో ఆంధ్రులకు కొంతవరకు తెలియజేసినారు. కాని ఇప్పటికిని చరిత్రయన "ఏదో మనకుసంబంధములేని ప్రాచీనకాలపు గాథల"ని అనుకొనుటయేగాని ఇంకను చరిత్రయందలి ప్రాధాన్యము ఆంధ్రులకు బోధపడలేదు. వంగదేశీయులును, మహారాష్ట్రులును ఈవిషయమునందు మనకంటే జాగరూకతవహించియున్నారు. కాననే ఆరాష్ట్రములలో ఐకమత్యము, జాతీయదృష్టి, రాజకీయ కార్యదీక్షాతత్పరత, ఆంధ్రదేశమునకన్న యధికము.

ఇట్టి కొరతను దీర్చుటయే ఆధునిక చారిత్రక, సారస్వత మహామహుల ప్రధాన కర్తవ్యము. రాజకీయ రణరంగమున పాల్గొన ముందుకుదూకు యోధు లెంతయవసరమో, కర్మాగారములలో యుద్ధసామగ్రిని తయారు చేయువారుకూడ నేటి యుద్ధములందంత యవసరము. రాజకీయ సభలయందు పాల్గొని వాదోపవాదములు సల్పుటకు నడుములుకట్టువారెంత శూరులో, దేశసేవకులో, చరిత్రరూపముగను, సారస్వత రూపముగను జాతీయోద్బోధన కలిగించువారుకూడ అంత శూరులు; అంత దేశ సేవకులు. రాజకీయ వ్యవహారములందు చిత్తరంజన సుభాషచంద్రబోసుల సేవ ఎంత ప్రశంసనీయ మైనదో బంకించంద్ర, బానూల సారస్వత, చారిత్రక సేవయుగూడ అంత ప్రశంసనీయమైనదే. పాశ్చాత్య వ్యామోహమున దగుల్కొనిన వారెందరు బానూ గ్రంథపఠనమున మేల్కొనలేదు!

ఇట్టి గ్రంథరాజమును చదివి జనసామాన్యముకూడ ఆంధ్రదేశమునందు జాతీయ దృష్టిని యలవాటు చేసికొనుటకు నేటికి మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారు ఒక యవకాశమును కల్పించి ఆంధ్రుల మన్ననకు పాత్రులైనారు. 'ఆంగ్లమునుండి యనువాదమును చేయుటకూడఒకగొప్పయా' అని నిరాదరణ జూపుదురేమో? మూలమునందలి విషయములను ఎట్టి వ్యత్యస్తమునులేక తెలియబరచుటయే కాక అందలి భావ వీచికలను, దృక్పథమునుగూడ అనువాదమున సృష్టించి, భాషాంతరమునగూడ మూలమునందు వలెనే రసము చిలికించుట, మూలము వ్రాయుటకన్న కష్టతరమగు పని. ఇందుకు తార్కాణము కవిత్రయ భారతానువాదమే యని ఆచార్య వెంకట రంగయ్యగారు తమ ఉపోద్ఘాతమునందు వ్రాసియున్నారు.

ఇట్టిగ్రంథమును విమర్శింపబూనుట కేవలము సాహసము. అందున కేవలమొక్క చిన్న వ్యాసమున అట్టిపని చేయబూనుట అసాధ్యము. గ్రంథమును చదువబూనినచో తుదివరకు చదువక మానివేయ మనసొప్పదనిన ఎంతమాత్రమును అతిశయోక్తిగాదు. భేదాభిప్రాయములుండినను ఉండుగాక. అతిశయోక్తి కొంతవరకిందు గన్పించిన గన్పించుగాక. పక్షపాతమనెడి దోషమునకుగూడ ఈ గ్రంథము చాలవరకు గురియైనను గావచ్చును. తన్నుగూర్చి తానే వ్రాసికొనినను, తనవారిని గూర్చి వ్రాసికొనినను, కేవలము జితేంద్రియుడై పారమార్థికదృష్టితోనున్నవానికి తప్ప ఇట్టి దోషములు సంఘటిల్లుట సహజమే, కాని భారతీయులమైన మనము, మన చరిత్రను వ్రాయబూనినచో మనలోపములను మనమెట్లు సమర్థించుకొందుమో, ఎదుటవాని లోపములనెట్లు అతడిదివరకు కప్పిపుచ్చెనో స్థూలదృష్టికి అవకతవకగ గన్పడు మనచర్యల కెట్టి రహస్యకారణములుగలవో ఇవన్నియుకూడ కొంతవరకు స్పష్టమగును.

ఆదర్శచరిత్రయందు అతిశయోక్త్యాదిలోపము లెంతమాత్రమును ఉండగూడదనుట నిజమే. కాని ఇదివరకు హిందూదేశచరిత్రను వ్రాసినవారు ఒక్క ఆంగ్లేయులుమాత్రమే. ఒకరిద్దరు భారతీయులు చరిత్రవ్రాయబూనుకొనినను వారుకూడ (ముఖ్యముగ బ్రిటిష్‌మహాయుగ చరిత్రయందు) కేవలమాంగ్లదేశీయులు వ్రాసిన చరిత్రలపై యాధారపడి వ్రాసియున్నారే కాని స్వతంత్రముగ పరిశోధనచేసి వ్రాయరైరి. కాన 'బాసు' వంటి సుప్రసిద్ధ భారతీయ పండితులెందరో ఇంకను పరిశోధనచేసి ఇట్టి గ్రంథము లింకను ఎన్నియో ప్రచురించినగాని మనకు ఇరుపక్షములవారి బలాబలములు, సత్యాసత్యములు సరిగా తెలిసి నిజము వ్యక్తముగాదు. ఇరుకక్ష్యలవారి వాదములను వినక తీర్పు చెప్పుట ఎట్టి అసమంజసమైన కార్యమో, అట్లే ఆంగ్లేయులు, భారతీయులుకూడ ఇటీవల జరిగిన యంశములనుగూర్చి ఏమిచెప్పగలరో సాంతము వినక ఆదర్శచరిత్ర వ్రాయబూనుట అట్టి అసమంజసమైనకార్యము.

కాని ఒక ప్రధాన విషయమును గూర్చి ఇట ప్రస్తావింపక పోయినయెడల ఈ విమర్శనము సమగ్రత నొందదు. ఆచార్య వెంకట రంగయ్యగారు తమ ఉపోద్ఘాతమునందు చెప్పినట్లు బాసుగారి పుస్తకము నందును, అంతకన్న యధికముగ శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారి అనువాదమునందును బ్రిటిష్‌వారి చర్యలను ఖండించునపుడు కాన్పించు తీవ్రత కొన్నికొన్ని సందర్భములందు అనౌచిత్యమునకు పాల్పడి చరిత్ర విషయమునందు చదువరికి అవిశ్వాసమును బుట్టించును. అట్టి సందర్భము లెన్నియో లేవు. కాని గ్రంథకర్త యుద్దేశ్యమే సక్రమముగ నెరవేరవలయు నన్నచో అట్టిసందర్భముల కెంతమాత్రమును అవకాశ మొసంగరాదు.

నిజమరయబూనితిమేని పాశ్చాత్యులలోగూడ కొందరు భారతీయసంస్కృతికి అచ్చెరువునొంది జోహారులర్పించినవారు లేకపోలేదు. భారతీయవిజ్ఞానమును, భారతీయకళాసంపత్తిని బ్రిటిష్ వారు అభివృద్ధిపరుపకపోవుటకును, భారతదేశమునందలి స్వతంత్రరాజ్యముల నన్నింటిని వినాశమొనర్చుటకును కారణము వారిస్వార్థపరత్వము, అహంభావము, అన్యాయ, దురాశ, అసహిష్ణుత, ద్వేషము మొదలగు దుర్గుణములుమాత్రమే యనితలంపరాదు. వారిలోను మనలోనుగూడ చాలమందికి నాటికిని నేటికినిగూడ ప్రాచ్యవిజ్ఞానమునందును, ప్రాచ్య సంస్కృతియందును, ప్రాచ్య రాజకీయ పరిస్థితులయందును, పద్ధతులందును ఎంతమాత్రమును విశ్వాసములేకపోవుటయే ఇందుకు ప్రధానకారణము. క్రీ. శ. ౧౮౫౭ యందు సిపాయికలహము జరిగినతరువాత ఇట్టి ద్వేషభావమేర్పడినదనినను యనవచ్చును. కాని అంతకు పూర్వము ఇట్టి ద్వేషము అంతగా కానరాదు. నాటి ఆంగ్లేయుల సాంఘిక చరిత్ర చదివినచో ఆంగ్లేయులు ఒక విచిత్ర పరిణామ పరిస్థితియందుండిరనియు, ప్రపంచమునకంతటికిని తామే విజ్ఞానబీజ వ్యాప్తికొరకై భగవన్నియుక్తమైన మానవజాతి యనియు, ఈ యమూల్య విజ్ఞానవ్యాప్తి గావించుట తమ నియత ధర్మమనియు, ఇం

దెంతమాత్రమును సందేహమున కెడము లేదనియు, భావించుచుండిరని తెలియుచున్నది. రాజా రామమోహనురాయివంటి ప్రజ్ఞాశాలిగూడ ఎట్లు హిందూదేశమున ఒక్క ఆంగ్లవిద్యాభివృద్ధియే భావ్యభ్యుదయ హేతువని మనఃపూర్వకముగ నమ్మి తనజీవితమునంతయు ఆంగ్లసంస్కృతి వ్యాప్తికై ధారవోసెనో అట్లనే మెకాలే మున్నగు మహాశయు లందరుకూడ భారతదేశ సంస్కృతి వార్ధక్య దశయందుండెననియు, ఆసంస్కృతియు అస్వశక్తిత్వమును జీర్ణమై, నశించి, రూపాంతర మొందుటకు అత్యావశ్యకమైన విశేష సాధనము ఒక్క పాశ్చాత్య విజ్ఞాన బీజమే అనియు తలంచిరి. కాన ఇట్టివారికి మనము లేనిపోని కౌటిల్యమును, ద్వేషభావమును, ఆపాదించుట సత్యచరిత్ర రచనకు దూరమగును.

కాని విజ్ఞానము అపారము, అనంతము. సమగ్రత ఏ వ్యాసమునందును, ఏ గ్రంథమునందును ఉండజాలదు. గ్రంథకర్త యుద్దేశ్యమెప్పటికిని పఠితవిషయమునందు చదువరికి ఉత్సాహము కలుగజేసి ఇంకను అధికముగ గ్రంథపఠనకును, పరిశోధనకును పురికొల్పుటయే కాని తన సర్వజ్ఞత్వమును, తన గ్రంథసర్వోత్కృష్ట్యమును చాటి చెప్పుట కాదు. మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి గ్రంథమును ఆంధ్రులు ఆబాలగోపాలము చదివి వారు వ్రాసిన ప్రతివిషయమును సకారణముగ ఖండింప నుద్యుక్తులైనను వారు కృతకృత్యులగుదురు. ఆధునిక యుగమున దూషణభూషణములను రెండింటినిగూడ సహింపనగును; గాని ఉపేక్షాభావమును మాత్రము ఎంతమాత్రమును సహింప సాధ్యము గాదు.

ఇంతశ్రమపడి ఇట్టి అమూల్యగ్రంథమును ఆంధ్రలోకమున కొసంగిన మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారును, సేవాశ్రమ ప్రముఖులును ఎంతయు ప్రశంసాపాత్రులు. వారి ఆశయము సఫలీకృతమై ఆంధ్రదేశమున చారిత్రకవిజ్ఞానమును, విజ్ఞానజనిత సమగ్రబలసంపత్తియు సమకూరుగాత !

డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, యం. ఏ., పిహెచ్. డి. (లండను)

భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము : కర్త—శ్రీ దిగవల్లి వెంకటశివరావు
1/8 క్రౌనుసైజు 320 పేజీలు, వెల రు 1—4—0

జాతీయవాదు లెందరోయున్నారు గాని వీరిలో చాలామందికి విషయజ్ఞానము చాలతక్కువ. బల్లగుద్ది ఘంటాపథముగ బ్రిటిష్‌వారుచేసిన 'అకృత్యముల'నుగూర్చియు 'అన్యాయము'నుగూర్చియు వాదింతురేగాని తమరు తమకే ఆవిషయములందలి సత్యాసత్యములు చాలవరకు బోధపడలేదని తెలియును. కాననే విద్యార్థులు, ధనవంతులు సత్యపరిజ్ఞానవ్యాప్తికై ఎంతపాటుపడిన అంత మేలు. పండిత పామరులకుగూడ తెలియవలసిన ఇట్టి విషయము లన్నిటిని కడు ప్రయాసతో ఒక్కచోట జేర్చి వానినన్నిటిని చక్కని శైలిలో పుస్తకరూపమున ప్రచురించినందునకు జాతీయవాదులేగాక ఆంధ్రులందరును దిగవల్లి శివరావుగారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించవలసినదే. నూతన ఇండియారాజ్యాంగమునుగూర్చియు ముఖ్యముగ ఫెడరల్ రాజ్యాంగమునుగూర్చియు ఇంతసంగ్రహముగను ఇంతస్పష్టముగను ఆంగ్లములోకూడ ఎవరును వ్రాయలేదనుటలో ఎంతమాత్రమును అతిశయోక్తిలేదు. వీరి పుస్తకము చివరనున్న అనుబంధములుమాత్రమే చాలు, ఈపుస్తకము అమూల్యమనిపించుకొనుటకు. ఇంతటి చిన్నపుస్తకమునందు ఇన్ని విషయములను జొప్పించియుగూడ చదువరి కెంతమాత్రమును విసిగించక రక్తికట్టునట్లు వ్రాయునేర్పు శ్రీ శివరావుగారికున్నది. చర్చితవిషయ మెంత క్లిష్టమైనదైనను ఏవిధముగ విశదీకరించినచో చదువరికి సులభముగ బోధపడి శ్రీ శివరావుగారి వాదమునందు నమ్మకము బుట్టించునో అట్లు వ్రాయగల్గుట ఈ సుప్రసిద్ధ న్యాయవాదికి సాధ్యమగును కాని కేవల మొక్క చరిత్రజ్ఞానమున్నంతమాత్రమునగాని, జాతీయవాదియైనంతమాత్రమునగాని స్వతఃసిద్ధముగ అలవడుశక్తిగాదు. శ్రీ శివరావుగారి గ్రంథములు రాజకీ

యములందు సత్యవిమర్శనమును, సహేతుకవిమర్శనమును అభివృద్ధిజేయుటకు చాల సహకారియని జెప్పవచ్చును. కాననే ఈగ్రంథములు ఆంధ్రుల ఆదరణకు పాత్రమగునని నమ్మవచ్చును.

పు. శ్రీ.

**భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్ర యుగము అను బ్రిటిష్ ఇండియా చరిత్ర :**

కర్త—దిగవల్లి వెంకటశివరావు, $\frac{1}{8}$ క్రౌనుసైజు 440 పేజీలు, వెల రు 1-8-0

స్వాతంత్ర్య సమరమనునది ఎప్పటికిని ఒక్క రాజ్యాంగ విషయములలో మాత్రమే సంభవింపదు. స్వాతంత్ర్యేచ్ఛ రాజ్యాంగ విషయములలో ప్రారంభమైనను, ఆర్థిక సాంఘిక పరిస్థితులనుగూడ చాలవరకు ఆవహించి, సారస్వతములోగూడ గూడుకట్టుకొని విజ్ఞానార్జనకును, విజ్ఞానాభివృద్ధికిని గూడ మూలహేతు వగుచున్నది. భారతీయ స్వాతంత్ర్య సమరములో ముందంజ వేసినవారు ఆంధ్రులు. కాననే ఆంధ్రులు ఈ ఒక్క విషయమునందేగాక సారస్వతము నందును సంస్కృతి విభాగము లన్నిటియందునుకూడ ఉన్నతస్థితి బడయ సమకట్టు చున్నారు. దిగవల్లి శివరావుగారు సుప్రసిద్ధ న్యాయవాదులు, జాతీయవాదులుకూడ. అట్టివారు చరిత్ర చదివి వ్రాయబూనుకొన్నచో పాఠశాలలందును కళాశాల లందును చరిత్ర నేర్పువారికిని, అట్టివారికొరకు చరిత్రలు వ్రాయువారికినిగూడ కాళ్ళు చల్లబడును. ఏవిషయమును తీసికొనినను శివరావుగారు సహేతుకముగ, శాస్త్రీయముగ చర్చించి ఎదుటవాని మనసును త్రిప్పివేయుటకే ప్రయత్నింతురుగాని ఉత్ప్రేక్షాతిశయోక్తులతో చదువరిని విసిగించి చర్చిత విషయమున అవిశ్వాసమును కలిగించునట్లు ఎంతమాత్రమును వ్రాయరు. కాననే ఇటువంటి పుస్తకములు మునుముందు అధికముగ తెనుగున ప్రచురింపబడినను ఈ పుస్తకము చాల కాలము వరకు చదువరుల నాకర్షించు చుండునని నమ్మెద. విషయ విభజనయందేమి, చర్చిత విషయములందలి మేలుకీళ్ళను విశదీకరించుట యందేమి, తమ యభిప్రాయమును బలపరచుటకు అచ్చటచ్చట వారుచేయు వాదము లందేమి, కడకు ప్రస్తావవశముగ ఒకొకచోట ప్రయోగించు విమర్శనా బాణంబు లందేమి దిగవల్లి శివరావుగారు ఒక క్రొత్త త్రోవ నవలంబించిరి. కాననే ఈ పుస్తకము పండిత పామరులకుగూడ ఆకర్షకరముగ నుండును. జాతీయోద్బోధనకు ఇట్టి పుస్తకములు అమూల్యములు. శివరావుగారు ఆంధ్రలోకమున కంతయు మాననీయులు.

పు. శ్రీ.

**హిందూలా — ఆంధ్రులకు వర్తించు మితాక్షరము:**

క్రౌనుసైజు 430 పుటలు గ్రంథకర్త : పిశిపాటి వెంకటసుబ్రహ్మణ్యం, బాపట్ల
రఫ్ కాగితము, అట్టబైండు, వెల రు 1-12-0

నానాటికీ నిత్యజీవనంలో లా అత్యవసరం అవుతూవుంది. అటువంటిసమయంలో తెలుగుభాషలో సులభసాధ్యంగా వుండేటట్లు 'హిందూలా' సమగ్రంగావ్రాసిన ఈగ్రంథకర్త కృతార్థుడు. తొలిపలుకుల్లో ఈగ్రంథమునుగూర్చి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణగారు, "గ్రంథకర్త బహు సులభశైలిలో ఎల్లరకు బోధపడురీతిని యీగ్రంథమును చక్కగా వ్రాసియున్నారు. ఇందలిభావములు ప్రస్తుత మములులోనున్న తీర్పులననుసరించి సరిగనేయున్నవి. 1938 వ సం॥ జూన్ వరకు వెలువడిన ఆయా హైకోర్టులతీర్పులలోని ముఖ్యాంశములను, ప్రివీకౌన్సిల్ తీర్పులలోని ముఖ్యాంశములనుగూడ నీచిన్నిగ్రంథమున పొందుపరచియున్నారు. ఇటీవల శాసింపబడిన నూతనచట్టములు అనగా, 'శారదాచట్టము', దేశముఖ్ గారి 'స్త్రీలహక్కులచట్టము', తదితరచట్టములు అందులోని ముఖ్యాంశములు ఆయాచోట్ల గ్రంథమున సూచించుటయేగాక, యీగ్రంథమున కనుబంధ

ముగ గ్రంథకర్తగారు స్వంతమున భాషాంతరీకరణమొనర్చి చేర్చియున్నారు. దీనివలన యీ గ్రంథము జనసామాన్యమునకు ఎక్కువ యుపయుక్తముకాగలదని నానమ్మకము" అని వ్రాసిరి. ఇంతకన్న దీనినిగూర్చి వ్రాయవలసినది కానరాదు. ఉపయోగకరమగు నిట్టిపుస్తకము లెక్కువ కాలము మనుటకై గ్లేజు కాగితముపై ముద్రించుటవసరము.

## సంస్కృత న్యాయములు 1, 2 భాగములు :

కర్తలు : కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

ప్రకాశకులు:—లక్ష్మీగ్రంథమండలి, తెనాలి.

క్రౌను సైజు 368 పుటలు, గ్లేజు కాగితము, అట్టబైండు, వెల రు 2—4—0

సంభాషణములలో, ఉపన్యాసములలో, వ్యాసములలో, గ్రంథములలో శ్రోతలకు, పాఠకులకు చిత్తము చివురింపజేయుచు, వక్తలయభిప్రాయములకు ప్రమాణములగునవి లోకోక్తులు. ఇవి ఆయా సందర్భములయందు కష్టసుఖముల ననుభవించిన ఆర్యుల యనుభవసార గుళికలు. ఆయనుభవములు అన్యోక్తిరూపముగ గానీ, నూటిగగానీ వెల్లడింపబడుచుండును. ఇవి మనకు ప్రపంచజ్ఞానమును, శాస్త్రసంప్రదాయములను కలిగించుటయేగాక ఆయా సమయములయందు మిత్రులవలె త్రోవ చూపుచుండును. ఇట్టివే సంస్కృతమునందలి న్యాయములు.

సంస్కృతమున నీ న్యాయములు వేలకొలదియున్నవి. గ్రంథకర్తలు, వ్యాఖ్యాతలు సందర్భోచితముగ వీనిని వాడియున్నారు. వీనివలన ఆయా ఘట్టములు మనకు హృద్గతములగును.

సంస్కృతమున ఈ న్యాయములను సంగ్రహించిన గ్రంథములు అనేకములున్నవి. తెనుగున నందిరాజు చలపతిరావుగారి 'సంస్కృతలోకోక్తి చంద్రిక'యు, చిలుకూరి నారాయణరావుగారి 'సంస్కృత లోకోక్తులు'ను ప్రసిద్ధములు.

వక్తలకు, కవులకు, విద్యార్థులకు, విద్వాంసులకు ఆవశ్యకములగు ఈ న్యాయములను సంగ్రహించి ఆంధ్రమున వివరణమువ్రాసి ప్రస్తుత గ్రంథకర్తలును, ప్రచురణకర్తలును ఆంధ్రమునకు మహోపకార కర్తలయిరి.

ఈ న్యాయము లకారాదిగా కూర్పబడినవి. వివరణముతోబాటు, వానికి సరిపడిన తెలుగు సామెతలును, ఆ న్యాయములను ప్రయోగించిన కవుల వాక్యములును సందర్భోచితముగ పొందుపరచుట ప్రశంసార్హము.

ఈ గ్రంథమున మొత్తము సుమారు పండ్రెండు వందల న్యాయములు కూర్పబడినవి. గ్రంథమున మొదటి భాగమున న్యాయములును, రెండవ భాగమున పరిభాషా రూపముగ నున్న వాక్యములును కూర్పబడి యున్నవి.

గ్రంథమున కూర్పవలసిన న్యాయము లింకను పెక్కులున్నవి. అరుంధతీ ప్రదర్శనన్యాయము, అశోకవనికా న్యాయము, యాచితకమండన న్యాయము, అజాతపుత్ర నామోత్కీర్తన న్యాయము మున్నగువానిని గూర్చి వేఱొక భాగముగ గూర్ప గ్రంథకర్తలు ప్రార్థితులు.

ఈ గ్రంథమునందలి వివరణములు కొన్ని విపరీతములుగ నున్నవి. మచ్చుకు—

1. అంతర్దీపికాన్యాయము:—'కుండలోనున్న దీపము పైకిప్రకాశింపక లోపలనే వెలుగును' అని యీ గ్రంథమునందలి వివరణము 'సత్యేన లభ్యస్తపసాహ్యేష ఆత్మా సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్' అన్నవాక్యమునకు 'నిత్యమ్ సర్వదా। నిత్యమ్ సత్యేన, నిత్యమ్ తపసా నిత్యమ్ సమ్యగ్జ్ఞానేనేతి సర్వత్ర నిత్యశబ్దః అంతర్దీపికాన్యాయేన అనువక్తవ్యః' అని శంకరాచార్యుల

వారు వివరించియున్నారు. (మాండూక్యము) 'ఇంటిలోని దీప మన్ని ప్రక్కలను ప్రకాశింపజేయు నట్లు' అని దీనిభావము. మఱి యీగ్రంథమునందలి కుండలోనిదీప మెచ్చటిదో?

2. గుడజిహ్వికాన్యాయము:— 'బెల్లము నాలుకపై నున్నంతసేపే తీపి' అని యీ సంస్కృతన్యాయము. 'యథాతిక్తభిషజానింబపానమకుర్వాణస్య బాలస్య జిహ్వాయాం గుడలేపం దత్త్వా పిత్రాదిః తంనింబం పాయతి ఏవమర్థవాదవాక్యాని బహ్వాయాససాధ్యేకర్మణి అప్రవర్తమానం పురుషం స్వర్గాక్షయ్యాదికం శ్రావయిత్వా ప్రవర్తయన్తి ఫలశ్రుతి రపిరోచనార్థా' (వాచస్పత్యము).
'చేదుమందు త్రాగనివాని నాలుకపై బెల్లమురాచి తరువాత మందుమ్రింగించినట్లు' అని దీనిభావము. ఇటులుండగా నీగ్రంథమునందలి వివరణమున కాధారమేమో ?

3. ఛత్రిన్యాయము:— 'ఒకమనుష్యుని యానవాలుచెప్పుటకు దుస్తులు మున్నగునవి యనేకము లుండగా గొడుగుపట్టుకొని వెళ్ళువాడు అనిచెప్పినట్లు' అని యీగ్రంథమున వివరణము.
యథాలోకే ఛత్రిణో గచ్ఛన్తీతి ప్రయోగే సపరివారే రాజ్ఞిగచ్ఛతి ఛత్రి అఛత్రిసముదాయే ఛత్రి శబ్దోవర్తతే ఏకసమూహవాహిత్వేన' (గోపాలయతీంద్రుని శతోపనిషద్వ్యాఖ్య)
కొందఱు గొడుగులు వేసికొనియును, కొందఱు లేకయును వెళ్లునప్పుడు 'గొడుగులు పట్టుకొని వెళ్లువారు' అన్నపుడు ఆ వాక్యమాయందఱకు వన్వయించునని భావము. మఱి యీగ్రంథవివరణము నకు మూలమేమో?

కొన్నిలోటుపాటులున్నను మొత్తమునీద గ్రంథమాదరణపాత్రము. మూల్యము కొంతతగ్గియున్న సులభగ్రాహ్యముగ నుండెడిది.

వడ్లమూడి వేంకటరత్నము

## సమీక్షకుచేరిన గ్రంథములు

చైతన్యప్రభువు : కర్త-లేళ్ల సాంబశివరావు, మోరి, తూర్పు గోదావరిజిల్లా
1/8 క్రౌనుసైజు 111 పేజీలు, వెల రు 0—8—0

మృత్యుంజయ శతకము : కర్త-లేళ్ల సాంబశివరావు, జాండ్రపేట, చీరాల
1/8 క్రౌనుసైజు 21 పేజీలు

శ్రీగోవింద దామోదర మాధవస్తోత్రము : సంస్కృత శ్లోకములు, తెలుగు తాత్పర్యము
రచయిత—శ్రీ బిల్వమంగళాచార్యులవారు
ప్రకాశకులు : శ్రీ వేంకటేశ్వరవిలాస పుస్తకభాండాగారము, ఉపమాకఅగ్రహారము విశాఖపట్టణముజిల్లా, 1/8 క్రౌనుసైజు 30 పేజీలు, వెల రు 0—2—0

### తాడేపల్లిగూడెం తాలూకా గ్రామసేవాసమితివారి ప్రచురణములు

1. **1939** ప్రజారోగ్య చట్టము (ప్రయోజనములు) :
రచయిత : శ్రీ కలిదిండి నరసింహరాజు, బి. ఏ. 1/8 క్రౌనుసైజు 32 పేజీలు

2. తాడేపల్లిగూడెంతాలూకా పంచాయతీమహాజనసభ: 6—11—1939
(ఉపన్యాసములు, తీర్మానములు, ఇతర వివరములు) 1/8 క్రౌనుసైజు 44 పేజీలు

3. 1 గ్రామోద్ధరణ : శ్రీ తేతలి సత్యనారాయణమూర్తిగారు
2 పంచాయతీపరిపాలనలోని సాధకబాధకములు : శ్రీ కలిదిండి గంగరాజుగారు
1/8 క్రౌనుసైజు పేజీలు 46+18

# Cultivation of a Community

*by*

S. R. RANGANATHAN, *M. A., L. T., F. L. A.,*
*University Librarian, Madras and*
*Secretary, Madras Library Association*

Any community is richer in its human resources than in the material ones. The human resources will yield the best economic value only if they are cultivated constantly and consciously. The cultivation of human resources repuires not ploughs but books. Books can enrich a community in a remarkable way. The magic that books can do in reviving and advancing a rural community is demonstrated by the history of Denmark.

## LOOK AT DENMARK

In several respects the Danish community is like that of South India. Its literature like ours consists more of lyrical poetry. Feeling and grace rather than force characterise Danish as well as South Indian music. Agriculture continues to be their chief means of existence as with us. There are few natural resources besides those the soil can produce. But Denmark had this additional handicap, its soil was not as rich as ours. And yet Denmark is now producing immense crops and making herself felt in the markets of the world. That is because it cultivated its human resources by its educational outfit which began with universal elementary and folk education and ended with a carefully coordinated system of progressive public libraries.

## THE LIBRARY CHAIN

The national library chain begins at one end with the two reservoir state libraries, the Royal Library and the University Library, at Copenhagen. At the other end of the chain there are about 800 village libraries scattered throughout the country. The intermediate links in the chain are the 80 town libraries of which 27, placed at the junctions, act also as regional or secondary reservoir libraries. The system of inter-library loan along this chain makes all the book resources of the nation available for a reader no matter where he lives. This wonderful coordination is one of the results of the Library

For the purpose of this paper let us take into consideration only two broad types (1) Those that render the contact itself of the Reference Librarian very difficult and, (2) Those with whom contact is easily effected but who are not able to express themselves clearly, leaving out of account readers with healthy library habit. In the first case the refractoriness of the readers is due either to a feeling of inferiority complex or superiority complex. Most of these people happen to be newcomers to the library. Very few of the readers that come to the library for the first time straightway come to the counter or reference section and introduce themselves as new to the library and request to be explained as to what one should do to get a book. Many of them feel overwhelmed by the atmosphere of officialdom or the immensity of the collections of books or the new environments and stand aghast without knowing how to proceed. A feeling of inferiority complex takes possession of them. Hence they feel shy and timid and allow that feeling to manifest itself in peculiar ways. On entering the library they take the nearest seat and snatch a book left on the table by another reader and turn over the pages with mind elsewhere and eyes all the while watching what the other readers do to get a book. Then, they migrate to the card catalogue and go on fidgeting with it. Or they go into the stackroom on pretext of simply seeing the library while their vacant looks betray them. Some readers of this category pose to know everything about the library and strut about with an air of cocksureness which has got its own awkwardness about it.

To the wide-awake reference librarian these are only symptoms of the shyness of readers badly in need of sympathetic attention and assistance. Being bashful they will rather choke themselves with their needs than breathe out their requirements to him. If they are to be served the initiative must come only from the reference librarian. Any customary, wooden and uniform method of dealing with them cannot produce the desired result. The best way to overcome the pitfall of shyness in these readers is for the Reference Librarian to put them at their ease and make them feel at home in the library without first referring to their requirements.

How to put them at their ease is a question for which the answer cannot be given categorically in a cut and dried formula. The Reference Librarian has to entirely depend upon the dictates of his instinct and professional flair to deal with these shy readers. He may spot out a shy reader even when he enters

